ఆంధ్రవిజ్ఞానసమితి. నెం 7 రు.

# కూర్మనాథకవికృతులు.

లక్ష్మీనారాయణసంవాదము, సుందరీమణిశతకము, సింహాద్రినారసింహశతకము.

ద్వితీయసంపుటము



ప్రకాశకులు:
ఆంధ్రవిజ్ఞానసమితి,
విజయనగరము

వెల ౦-౧౦-౦.

శ్రీ వేపకొమ్మ గురు వేంకటసుబ్బయ్యగారు,

బి. ఎ, సి. ఇ., యం. ఆర్ ఎ.,

అధ్యక్షులు.

ప్రథమముద్రణము:

వృష చైత్రారంభము,

1941.

కాకినాడముద్రాక్షరశాల,

కాకినాడ.

# విజ్ఞప్తి

ఉ. ఎప్పుడు ధర్మహానియగు నీధరణీస్థలి నాక్షణంబునం
దప్పక మాటిమాటి కవతారము లెత్తుచు సాధుకోటి మే
లొప్పగ నుద్ధరించి, కుజనోద్ధతి మాన్పిన విష్ణుమూర్తి మా
యప్ప! కృపాపయోనిధి నిరంతరసౌఖ్యము మాకు నీవుతన్.

ప్రపంచమున ధర్మగ్లాని కలుగునపుడు ధర్మోద్ధరణమునకై ప్రతియుగమునను సంభవించెదనని వచించిన శ్రీమన్నారాయణుఁడు, శ్రీ మహాలక్ష్మితో సవిలాసముగ బలికిన పలుకులనే, గోగులపాటి కూర్మనాథకవి, చక్కగ రసవంతముగ నాలు మగల సంభాషణరూపముగ పద్యముల రచించెను. ఈ లక్ష్మీనారాయణసంవాదము నిప్పటికిని శ్రీ కళింగవిజయనగర సంస్థానస్థవైష్ణవాలయములలో ననగా శ్రీరామతీర్థము, శ్రీకూర్మము, పద్మనాభము, సింహాచలము మొదలగువాటిలో ప్రతి నిత్యము తిరునాళ్లయందు వైష్ణవులు సంకీర్తనము చేయుచున్నారని తెలియవచ్చుచున్నది. ఈసంవాదమింతవరకు నిలచి యుండి, నిత్యోపయోగముగ నుండుట, దీనిప్రాశస్త్యము, పవిత్రతలనుచాటుచున్నది. అముద్రితమైన యీసంవాదము నాంధ్రులకు సమర్పించుభాగ్యము మాకు చేకూరినందులకు సంతసించుచున్నారము.

ఈగోగులపాటి కూర్మనాథకృతిగా, కళింగదేశమున వాడుకగల సుందరీమణిశతకమును, మద్రాసు గవర్నమెంటు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమునుండి వ్రాయించి తెప్పించి, ముద్రించి యాంధ్రికి యీసంపుటమున నొసంగుచున్నారము. ఈశతకము శృంగారరసభరితము. ప్రకృతికాంతాశృంగారమును, పురుషుఁడు, తలంచుకొని మాయాజాలమునఁబడి స్వప్నమున చర్వితచర్వణము గావించుట, మానవశృంగారముగ కవి చిత్రించెను. ఈగ్రంథము కూర్మనాథకృతమని చెప్పుట కీతని యితర కృతుల మిత్రత్వము యిందు చక్షుర్గోచరమగుచున్నది.

ఈకవిచంద్రుని నాల్గవగ్రంథము సింహాద్రి నారసింహ శతకము. ఇది కొన్ని పర్యాయములు ముద్రణభాగ్యమునుపొంది నప్పటికి కూర్మనాథకృతి సంపుటములో నిదికూడ ప్రధానమై యున్నది. ఈశతకరాజమును రచించుట కొక ప్రబలకారణము రాజకీయముగగలదు. ఈపదు నెనిమిదవ శతాబ్దిపూర్వభాగమున పిండారీలదండుముష్కరతురుష్కులు, సింహాగిరివరాహనరసింహ స్వామి దేవాలయమును దోచుకొనవచ్చినప్పుడు, శ్రీవిజయనగర సంస్థాన దేవసానోద్యోగిగనున్న కూర్మనాథకవి తమ భక్తిమాహాత్మ్యముట్టిపడునట్లు స్వామివారి దుర్బలత్వమును కొన్నిపద్యములచే వర్ణించగ, కవిచంద్రునిభక్తిప్రపత్తికి సంతసించి, తుమ్మెదలను సృష్టించి, దండును పారద్రోలెను. ఆదండు వాలితేరు మెట్టవరకు పారినది. ఇప్పటికీ విశాఖపట్నమున తుమ్మెదలమెట్ట

యున్నది పిమ్మట స్వామివారి మహిమాదికమును, తన అవజ్ఞ తను వర్ణించి, క్షమాపణ గావించెను. ఈశతకపద్యములు శ్రీ మహావిష్ణుని యవతారచర్యలతో కడుంగడు శ్రావ్యముగ నున్నది.

గోగులపాటి కూర్మనాథకవిచే రచింపబడిన మృత్యుంజయవిలాసమును మాసమితిలో ప్రథమసంపుటముగను తదితర కృతులను రెండవసంపుటముగ ముద్రించి యాంధ్రభారతి కొసంగినారము. ఈకవిజీవితము కవిత్వవిశేషములు మున్నగునవి మాసమితి ద్వితీయగ్రంథరాజమగు విస్మృతకళింగాంధ్రకవులచరిత్రమున శ్రీ అడిదము రామారావుపంతులుగారు, ఏతద్గ్రంథోపోద్ఘాతమున శ్రీమాన్ కరి నారాయణాచార్యులుగారు విశదీకరించి యున్నందున నిచ్చట ముచ్చటించు టనవసరము.

ఈ గ్రంథసంపుటికి విపులోపోద్ఘాతమును వ్రాసియిచ్చిన కవితావతంస గానకళానిపుణ, శ్రీమాన్ కరి నారాయణాచార్యులుగారికి మాకృతజ్ఞతావందనము లర్పించుచున్నారము.

విజయనగరము,
వృషచైత్రారంభము.

ఇట్లు,
**వేపకొమ్మ గురువేంకటసుబ్బయ్య,**
అధ్యక్షులు.

శ్రీ రామాయనమః

# ఉపోద్ఘాతము.



ఉ. శ్రీకమనుండు సింహగిరి శేఖరుఁడే కవిమాళి యుల్లస
న్నాకధునీ తరంగనటవప్రతిమల్లన పీనసూక్తి ము
క్తాకమనీయపద్యశతకంబు వచింపఁ బ్రసన్నుఁడయ్యె నా
గోకులపాటి కూర్మకవికుంజరు నంచితవాంఛ నెంచెదన్

* ఈప్రబంధమును రచించినకవి గోకులపాటి కూర్మనాథకవి. ఇతఁడారువేల నియోగి బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. మౌద్గల్యసగోత్రుఁడు. సూరనామాత్యుని పౌత్రుఁడు. గౌరమాంబా బుచ్చెనామాత్యులకుఁ బుత్రుఁడు. వెంకన్న, రామన్న, యను ననుజన్ములుఁగూడ నితనికిఁ గలరు.

## నివాసస్థానము.

ఈతనితండ్రియగు బుచ్చెనామాత్యుఁడు విశాఖపట్టణము జిల్లాలోఁ జేరిన గజపతినగరమునకు సమీపమునఁగల దేవుపల్లి యనుగ్రామమున నివసించుచుండెడివాఁడు. ఇక్కవిచంద్రుఁడు

గూడ బాల్యమున నాగ్రామముననే నివసించెడివాఁడు. కాని వివాహానంతర మిక్కవీంద్రుని యత్తవారు విజయనగరమునకు సమీపముగానున్న రెల్లివలసయగుటచే నచ్చట కీతఁడు తఱచుగా వచ్చుచుండుటయుఁ, బిదప రెల్లివలసకుఁ జేరువగానున్న శ్రీరామతీర్థమునకుఁ గూడవచ్చి శ్రీరామచంద్రుని సేవించి, తత్‌క్షేత్రనివాసులును, శ్రీ విజయనగరమహారాజుల గురువర్యులును నగు శ్రీమత్తిరుమల పెద్దింటి సంపత్కుమార వేంకటాచార్యులయ్యవార్లంగారిని దర్శించి, వారికి శిష్యుఁడై విద్యాభ్యాసమును గావించుటయుఁ గారణముగా శ్రీరామ తీర్థమునందే నివాసమేర్పరచుకొని యుండెడివాఁడు. ఇప్పటికిని వీరి గృహనివేశనస్థల మీయూరిలోఁ బ్రసిద్ధివహించియున్నది. విద్యాభ్యాసము యిక్కవిశిఖామణి బాల్యాత్ప్రభృతి, మహామేధావియు, సుగుణగణమణీయుఁడునునై శ్రీ అయ్యవార్లంగారి సన్నిధానమున విద్యాభ్యాసమును బ్రారంభించిన యచిరకాలములోనే కావ్యనాటకాలంకారసాహితీధురంధరుఁడై శాస్త్రచర్యాదలనుగూడ బాగుగా నెఱింగినవాఁడై, యాంధ్రగీర్వాణభాషలలో నసమానముగాఁ గవిత్వముఁ జెప్పెడినేర్పును గడించెను. శ్రీ అయ్యవార్లంగారివలనఁ గేవలము విద్యనేగాక పంచసంస్కారములను వడసి, శ్రీ వైష్ణవమునవలంబిమైనాఁడు. భగవద్భాగవతాచార్య భక్తినిష్ఠాగరిష్ఠుఁడై శ్రీ వైష్ణవమతసాంప్రదాయికగ్రంథ

తిరుమంగయాళ్వారి దివ్యచౌర్యపుఁగథన్
హరిలక్ష్మిసంవాద మనుచుఁజెప్పి
మును "వైహారరంహ" యని ఘనశతకంబు
సింహాద్రివిభుని దర్శించిచెప్పి
యేకాంతసేవాఖ్య హృద్యప్రబంధంబు
రామతీర్థపతి కర్పణమొనర్చి

గీ. బాదులాఖానునోంచి శుంభత్ప్రతాపుఁ
డౌ విజయరామగజపతి క్ష్మాధినాథ
దత్తబహుళాగ్రహార విత్తములనందె
మహిని గోకులపాటి కూర్మప్రధాని.

ఈవిధముగాఁ జెప్పియున్నాఁడు. దీనింబట్టిచూడఁగా "బాదల్లాఖాను"ను గెల్చిన శ్రీ పెదవిజయరామ గజపతిమహారాజుగారి కాలముననే యీతఁడు సుప్రసిద్ధుఁడై మహారాజ సన్మానపాత్రుఁడైనట్లు తెలియవచ్చు చున్నది.

## కవికృతగ్రంథములు

ఇక్కవి తల్లజుని గ్రంథములను జెప్పుటకుం మున్నితని కవితాస్వభావమును జెప్పుటగూడ నావశ్యకమైనను, గ్రంథవైపుల్యసందేహముచే సంగ్రహముగా నీవిషయమును జెప్పుచుఁ బ్రకృతమున కుపక్రమించెదను. ఈతఁడాంధ్ర గీర్వాణభాషల లోనే గాక, అఱవము, ఉర్దూ, భాషలలోఁగూడ మంచి పరి

చయముగలిగి, తత్తద్భాషల నాంధ్రప్రబంధములలోఁజక్కఁగా హృదయంగమముగాఁ జొప్పించి, కవిత్వముఁ జెప్పుటలో మిక్కిలి నేర్పరి. ఈతని కవిత్వము, శ్రావ్యముగామధురముగా, లలితముగా, సరళముగానుండునని చెప్పుటకావంతయు, సందేహము లేదు. సామాన్యముగ శ్లేషకలపద్యములను రసవంతము గాను, మృదుళముగాను జెప్పుట దుస్సాధ్యము. అయినను, సులభముగాను, సుగమముగాను, శ్లేషకవిత్వమును జెప్పుటయందీతఁడు మిక్కిలిసమర్థుఁడు. మఱియు,సందర్భానుసారముగా,సరసముగా సామెత (లోకోక్తు) లను బద్యములలో సంగ్రథన మొనర్చుటయం దీతనికిఁగల సామర్థ్యము విశేషప్రశంసనీయము. సంగీతశాస్త్రమునందుఁ గూడ మంచి యనుభవమును, బాండిత్యమును గలవాఁడనియు గేయరచనా చాతురీధురీణుఁడనియుఁ జెప్పుట కీకవీంద్రుని యక్షగానమే మనకు దృష్టాంతము.

ఈ సుకవివతంసుఁ డెన్ని గ్రంథములను రచించెనో నిక్కముగాఁ జెప్పుట కవకాశము లేకున్నను, ఇప్పటికిఁ దెలియుగా వచ్చిన గ్రంథములు (1) మృత్యుంజయ విలాసము (2) సుందరీ మణిశతకము (3) విజయరామశతకము (4) ఏకాంత సేవ (5)సింహాద్రి నారసింహాశతకము (6) లక్ష్మీనారాయణసంవాదము. అను నీయారుగ్రంథములును, నుపలబ్ధములై వెలయుచున్నవి. ఈ గ్రంథములలోఁగూడఁ గొన్ని సమగ్రముగాను, గొన్ని యసమగ్రముగాను, లబ్ధములైనవి. ఈగ్రంథములనేగాక

శ్రీరామతీర్థమునందుఁగల పర్వతముపైనున్న జలకుండికలు, పాండవులపంచలు, ఇఱుకుతాయి మొదలగు దర్శనీయస్థలము లపైన నేకములగు చాటుపద్యములును, జూర్ణికలును నిక్కవి వరేణ్యుఁడు రచించినట్లు శ్రీ ఆదుర్తి హరిహరదాస (కూర్మకవి కృతగ్రంథవిలేఖరి) వంశజులును, కీ॥ శే॥ ఆదుర్తి అప్పలనరసిం హంపంతులుగారు నాతోఁ జెప్పిరి. ఇఁక నీతని గ్రంథములను గూర్చెను వివరించెదను.

## మృత్యుంజయవిలాసము

ఇది యాశ్వాసత్రయోపేత యక్షగాన ప్రబంధము. కూ॥ కవి॥ దీనిని శృంగారనాటకగేయ ప్రబంధమని పేర్కొని యున్నాఁడు. ఇందు సమగ్రముగాఁ బార్వతీపరమేశ్వరుల పరిణ యము వర్ణింపఁబడినది. ఇది యక్షగాన ప్రబంధమైనను, సుప్ర సిద్ధ మహాప్రబంధమువలెనే వర్ణనలతో నలరారుచున్నది. శైలి మృదుల మధురముగా విరాజిలుచున్నయది. ఇట్టి యుత్కృష్ట ప్రబంధమును విజ్ఞానసమితివారు వినూత్నముగా వెలువరింపఁ జేసినందుల కెంతయు సంతసింపవలసినదిగా నున్నది.

## సుందరీమణిశతకము

కూ॥ కవివరేణ్యుఁడు విష్ణుభక్తిపరాయణుఁడు తా రచిం చిన గ్రంథములన్నియు భగవత్సమర్పణమునే జేసినాఁడు కాని, నరస్తుతిఁజేసి, నరనామాంకితముగాఁ జేయుట లేదు. అట్లొనర్చు

టకిష్టపడుట గూడ లేదు. బమ్మెరపోతనవలె శ్రీరామభక్తుఁడై స్వరచిత గ్రంథములను హరినామాంకితములుగానే జేయుచు, నరనామాంకితములుగాఁ జేయుట కంగీకరింపక యుండగా నొక ప్పుడు శ్రీవిజయరామగజపతి మహారాజుగారు తమయొక్క భోగకాంతపై నొక శతకమును జెప్పవలెనని నియమింపఁగాఁ దప్పనిసరిగా నిక్కవిసత్తముఁ డీశతకమును శృంగారరసమయ ముగాఁ జెప్పెనని పండితపరంపరాగత వార్తనొకదానిని కీ॥ శే॥ శ్రీ నిడదవోలు సుందరముపంతులుగారు సెలవిచ్చి యున్నారు. ఈ శతకమునందుఁగల పద్యములన్నియు, నత్యంతరమణీయ శైలీవిరాజితములై, రసవత్తరములై, రసికజనమనోరంజకము లై యలరారు చున్నవియనుట యతిశయోక్తికానేరదు. లభిం చినంతవఱకీ శతకమునుగూడ నిందు ముద్రింపఁజేసిరి గావున మచ్చునకుఁ బ్రత్యేకముగా నిచ్చట పద్యముల నుదహరింప లేదు. "కుడువఁబోవుచు, రుచులతీరడుగనేల?"

## విజయరామశతకము

భగవద్భక్తాగ్రేసరుఁడై, పద్యమయముగనో? గద్యమ యముగనో? పద్యగద్యగేయాత్మకముగనో? భగవదర్పితము గానే ప్రబంధములను జేయుచు, భగవదితర విషయ పరాఙ్ము ఖుఁడై, భగవద్ధ్యానతత్పరుఁడగు, కూ॥ కవిపుంగవుఁ డొకసమ యమున శ్రీ విజయరామ గజపతిమహారాజావారి సందర్శన

మున కేగినంత నాయన తనపై నేదేనికృతిని రచింపవలసిన దని నియమింపగా నరనామాంకితముగాఁ గృతిని రచింపనిచ్ఛ గింపని యీతఁడు మహారాజాజ్ఞోల్లంఘనముఁ జేయఁజాలక తన యొక్క ప్రతిజ్ఞకు భంగముకలుగకుండునట్లుగను, రాజాజ్ఞఁదిర స్కరింపకుండునట్లుగను, "విజయరామా! రామతీర్థాశ్రమా!" యనుమకుటముగల శతకము నొకదానిని జెప్పి మహారాజా వారిని మెప్పించినట్లు కింవదంతికలదు. పై రెండువాక్యములును శ్రీరామచంద్రమూర్తికిని, మహారాజుగారికిని గూడ నన్వయిం పఁగలవనుటలో సందేహము లేదు. ఈ శతకమింతవఱకు సమ గ్రముగా నెచటను లభింపలేదు. లభించినవి మూఁడుపద్యములు మాత్రమే. ఆపద్యత్రయము నిట నుదహరించుచున్నాఁడను.

శా. స్వామిన్ గన్నదిపూట, పుణ్యనది ప్రేవంజన్నదే బాట మీ
ధామంబున్నదె పేట ధర్మసభసత్యంబన్నదేమాట, యే
సీమన్ వస్తుసమృద్ధిచే భటులచేఁ జెల్వైనదే కోట, పెన్
మామిళ్లున్నదె తోట, శ్రీవిజయరామా! రామతీర్థాశ్రమా!

మ. సములద్దైనది బారు, మీభజనచే జాగైనదే నోరు, గ్రీ
ష్మములోఁ బారిన దేరు, సజ్జననివాసంబున్నదే యూరు, రో
గము బాగైనదె వేసు, మీపదపరాంగంబున్నదే సీరు, ధ
ర్మము చేఁ గన్నది పేరు, శ్రీవిజయరామా! రామతీర్థాశ్రమా!

మ. ఘనకోపంబతిశోభికే, పరుషవాక్యప్రోద్ధతుల్ పందకే
ధనకార్పణ్యము పాపశీలునకె, కాంతాబద్ధమోహంబు జా
రునకే, నిర్మలసాధువంచనవిధుల్ మూర్ఖాళికే,యిమ్మహిక్
మనుజస్వామికి ధర్మమా !విజయరామా! రామతీర్థాశ్రమా!

ఈమూఁడుపద్యములును, నెల్లిమర్ల నివాసులగు శ్రీభట్టు అప్పలరాజుగారివలన నాకు లభించినవి. వారికిని ఈమూఁడు పద్యములే లభించినవట. ఇట్టి యమూల్యశతకరత్న మాంధ్రలోకమునకు లభించక యేమారుమూలనో యడఁగియుండుట దురదృష్టమే యనవచ్చును. ఈపద్యములయొక్క శైలినిబట్టి చూచినచో శతక మెంతయు హృదయానందసంధాయకముగా నుండుననుట నిశ్చయము.

## ఏ కాం త సే వ.

శ్రీ రామతీర్థస్వామివారిపై సీతఁడు రచియించిన కొన్ని పాటలు, పద్యములు గ్రంథరూపముగానుండి యీపేరుతో వ్యవరింపఁబడుచున్నవి. దేవాలయములోఁ శ్రీస్వామివారి సన్నిధానమునఁ దత్తదవసరములయం దిప్పటికిని కీర్తనాదులను, గీర్తనభాగవతులు పాడుచుందురు.

## సింహాద్రి నారసింహశతకము.

పూర్వ మొకప్పుడు సింహాచలములో దేవాలయమును ధ్వంస మొనర్పఁబూని క్రూరులగు యవనులు ముట్టడించి, యాక్రమింపఁగా, మహాభక్తుఁడును, మహాకవియు, నగుసీతఁడు

ముందుగానే యీవార్తను దెలిసికొన్నవాఁడై, దేవాలయాంతర్భాగమున నిగూఢముగానుండి, మహాభక్తితాత్పర్యములతో శ్రీసింహాద్రినాథునిఁ బ్రార్థించుచుఁ దాదాత్మికప్రతిఫలత్కవితాప్రభావసందర్భసంగతముగా నొక సీసపద్యముయశతకమును "వైరిహరరంహ! సింహాంద్రినారసింహ!" యను మకుటముతోఁ జెప్పెను. ఈశతకమునందుఁ గవి యవను లొనర్చు ఘోరకార్యములను శాంతింపఁజేసి, శత్రుక్షయమును జేయుమని శ్రీసింహాద్రినాథుని హెచ్చరించుచు, నలువది పద్యములవఱకు,నిష్ఠురముగాఁ బ్రార్థించినాఁడు. మహాభక్తుఁడగు నీతని ప్రార్థన నంగీకరించి యలువదియెనిమిదవపద్యముఁ జెప్పినవెంటనే, భక్తవత్సలుఁడును, దేవదేవుఁడును నగు శ్రీసింహాంద్రినాథుఁడు గండుతుమ్మెదలదండుహూపమున బయలువెడలి, యవనసేనను, మర్దించుచుఁ బొడుచుచుఁ జీల్చిచెండాడుచు, విశాఖపట్టణము వద్దనున్న "తుమ్మెదమెట్ట" వఱకుఁ బారఁదోలెను. కావుననే యీమెట్ట కిప్పటికిని "తుమ్మెదలమెట్ట" యను వాడుక కల్గెనని జనశ్రుతి.

ఇది యిట్లుండఁగా మఱియొక చిన్నవిశేషమును మనవిఁ జేసెదను. ఈశతకమును రచించినకాలమును, గారణమునుగూడ నూహించుటకుఁ దగుచరిత్రాంశ మొకటి కలదు. దాని నిట నుదహరించుచున్నాఁడను. దీనిం గని నాయూహ యెంతవఱకు సార్థక్యము నందెనో? పాఠకులే యూహింతురుగాక! ఏమన?

# 12

శ్రీవిశిష్టాద్వైతమతోద్ధారకులగు శ్రీరామానుజాచార్యులవారు దిగ్విజయయాత్రాసందర్భమున శ్రీసింహాచలమునకు విజయము జేసిరి. అత్తఱి శ్రీసింహాద్రినాథున కంతరంగ భక్తుఁడగు కృష్ణమాచార్యుఁడను శ్రీవైష్ణవోత్తముఁ డొక డట నుండెను. ఆయన తనగానముచేఁ బ్రతిరాత్రియు, శ్రీసింహాద్రినాథుని మెప్పించి, తాండవింపఁజేసి, సుప్రసన్నునిగాఁ జేసికొనుచుండెడివాఁడు. శ్రీరామానుజాచార్యులవారిని సింహాచలదేవాలయమునఁ జూచియు, నాకృష్ణమాచార్యుఁడు సాష్టాంగప్రణామ మొనర్పక సంభాషణమైనను జేయక సగర్వముగా నూరకుండెను. ఈయన గర్వమును గాంచి రామానుజాచార్యులవారే స్వయముగా నీయనను బలుకరించి వినమ్రుఁడై "స్వామీ! కృష్ణమాచార్యోత్తమా! యీరాత్రి శ్రీసింహాద్రినాథుని సన్నిధానమున దేవర గాన మొనర్చి, యద్దేవదేవుని సుప్రసన్నునిగాఁ జేసికొన్నతఱిని దాసునకు ముక్తి కలదా? లేదా? యను విషయము నడిగి యందులకు శ్రీసింహగిరినాథుఁ డానతిచ్చినప్రత్యుత్తరమును గని, మఱల మీకును మోక్షము కలదా? లేదా? యను విషయమునుగూడఁ బ్రశ్నింపుఁడు. పిదప స్వామి యొసంగిన ప్రత్యుత్తరమును రేపటి యుదయమున దాసునకుఁ దెల్పుఁడు' అని వచించెను. అందులకుఁ గృష్ణమాచార్యుఁ డెంతయు, సంతసించి యారాత్రి నిజదివ్యగానమున నద్దేవదేవుని మెప్పించి ప్రసన్నునిగాఁ జేసుకొని

"స్వామీ ! దేవాదిదేవా ! దక్షిణదేశమునుండి, రామానుజాచార్యుఁ డనుయతివర్యు డొకఁడు వచ్చినాఁడు. ఆతనికి ముక్తి కలదా ? లేదా ? యను విషయమును దేవర నడిగి, మఱల దేవరవచించు ప్రత్యుత్తరమును గూడఁ దనకుఁ దెల్పవలసిన"దని నాతోవచించినాఁడు. ఏమియాజ్ఞ? అని శ్రీసింహాద్రినాథునితో విన్నపము జేసికొనెను. అంతట శ్రీసింహాద్రినాథుఁడు. "భక్తవరేణ్యా ! ఆ రామానుజార్యమునీంద్రుఁ డిచ్చినవారికి ముక్తి కల్గుచున్నప్పు డింక నాతనికి ముక్తి కల్గుటకుసందియమేమి ?" యనివచించెను. తరువాత కృష్ణమాచార్యుఁ డాసంగతినివిని, "స్వామీ ! నాకు మోక్షముకలదా ?" యని మఱల ప్రశ్నించెను., అందులకించుక సంశయించుచు, శ్రీ సింహాద్రినాథుఁడు "కృష్ణమాచార్యా ! నీవు భక్తుఁడవేకాని, నీకు మోక్షము నిచ్చుటకు నాకధికారము లేదు. ఏమన ? రామానుజాచార్యునకిదివఱలోనే విభూతిద్వయాధికారము నొసంగితిని. కావున నీకు ముక్తినిచ్చుటలోగూడ నాయనయే సర్వాధికారి. నీకు మోక్షముఁగావలయునన్న నాయననే యాశ్రయింపుము" అనివచించెను. ఆవిధముగా వచించిన భగవద్వాక్యములనువిని, కినిసి, కృష్ణమాచార్యుఁడు "దేవా! నిన్నాశ్రయించినఫలిత మిదియా ? పరమపదము కొఱకు పరుని ప్రార్థింపు మనియెదవా? యింత కాలమువఱకు నీయందత్యంతభక్తితాత్పర్యములతోఁబాడి భజిం

-చితిని గదా ? తుద కీవిధముగా నన్నుమోసగింతువా?" యని నిష్ఠురోక్తులాడెను. అట్టి నిష్ఠురాలాపములను సహింపఁజాలక శ్రీ సింహాద్రినాథుఁడును, "కృష్ణమాచార్యా ! నీవు రాజసుఁడవు, తామసుఁడవు, నీవు భక్తితోఁ బాడితినని యుపకారముగా జెప్పుచున్నావే? నీవుపాడితివి. నేనాడితిని. నీపాటకు నాయాటకు సరిపోయినది. బాకీమఱేమియులేదు. నీవిట్టి కఠినోక్తుల నాడినందులకు, నీరచించిన కీర్తనలన్నియు, నీచులపాలగుఁగాక" యని శపించెను. అంతఁ గృష్ణమాచార్యుఁడుఁగూడ మిగులఁ గ్రుద్ధుఁడై "నీయాలయమంతయు, నేకరీతిగా నేడుదినంబులు మండి, గోపురమంటపాదులన్నియుఁ గళావిహీనములై చెడును గాక" యని శ్రీ సింహాద్రినాథునకు మఱల బ్రతిశాపమిడెను. అటుపిమ్మట.

సీ. కృష్ణమాచార్యుల కీర్తనలన్నియు
నిత్యభోగ్యములయ్యె నేటికైన
మఱికొన్నినాళ్లకు "మలికినేబ" నువాఁడు
మ్లేచ్ఛాధిపతివచ్చి మిన్నురాయు
దివ్యవిమానంబుఁ దెగటార్చి కోవెల
బారచాపులఁద్రైల భాసితములఁ
జుట్టించికాల్చిన సుడిసి యేడహాములు
గాలిభక్త్యోక్తిచేఁ గదలకుండె"

అని యాచార్యసూక్తి ముక్తావళియందుఁ జెప్పఁబడిన విధముగా శ్రీ సింహాద్రినాథుని శాపవశమునఁ గృష్ణమాచార్యుని కీర్తనలన్నియు, నీచులపాలైనవి. మఱికొంతకాలమునకుఁ గృష్ణమాచార్యుని శాపప్రయోగ పరిణామముగా "మల్కినేబ్" అను మ్లేచ్ఛనాయకుఁడు సపరివారముగావచ్చి సింహాచలక్షేత్రమును ధ్వంసమొనర్పఁబూనెను. అట్టివేళనే మహాభక్తుఁడును, మహాకవియు, నగు మనకూర్మనాథ కవీంద్రుఁ డత్యంతభక్త్యుద్రేకముతో నాశుకృగా "సింహాద్రినారసింహా !" యను మకుటముతో శతకముఁజెప్పఁగా, భగవంతుఁ డనుగ్రహించినాఁడనియు, భగవదాలయమునకు భంగము వాటిల్లకుండెననియుఁ జెప్పఁదగియుండెను. పై పద్యములో "భక్తోక్తిచే"అనుపదముచే మహాభక్తుఁడగు మనకూర్మనాథకవీంద్రుని సూక్తిచేతనే క్షేత్రమునకు క్షేమముకల్గెనని యూహింపవలసియున్నది. మఱియు, శ్రీరామానుజాచార్యులవారును, "మల్కి-నేబ్" అను మ్లేచ్ఛనాయకుఁడును, భిన్నకాలీనులే యనుట నిశ్చయము. కాని, కూర్మనాథకవియు, మలికినేబ్ అనువాఁడును, సమకాలికులా? భిన్నకాలీనులా? అనెడు విషయముమాత్రము విమర్శనీయము. విస్తరభీతిచే నిట్టివిమర్శనమును విరమించి, సందర్భోచితముగానున్న చరిత్రాంశమును మాత్రము వ్రాసితిని. ఈ సుకవిశేఖరుఁడత్యంతభక్త్యావేశముచే నమృతప్రాయముగా, నతిభక్తిరసమయముగా, సహజగంభీర వాగ్ధాటితోఁ జెప్పిన యీశతకము

పాఠకులకుఁబఠించుచున్నకొలఁది పరమానంద సంధాయకముగా నుండునని చెప్పుటకేమాత్రమును సందేహింపనక్కఱలేదు. భక్తులకుఁ బఠనయోగ్యమై, పరమార్థసాధకమై, వాంఛితఫల ప్రదమైయుండు ననుట యతిశయోక్తి కానేఱదు.

## లక్ష్మీనారాయణసంవాదము

ఇయ్యది మూఁడాశ్వాసములుగల చక్కని ప్రబంధము. ఇందు మొదటి యాశ్వాసమున లక్ష్మీనారాయణుల యొక్క సంవాదమును, రెండవయాశ్వాసమున శ్రీ వైష్ణవమత ప్రతిష్ఠాపనాచార్యులును, పన్నిద్ద రాళ్వారులలో నొక్కరు, నగు శ్రీ తిరుమంగయాళ్వారుల చరిత్రమును, మూఁడవయాశ్వాసమున శ్రీ జగన్నాథస్వామి వారి రాయబారమును, వర్ణింపఁబడినవి. ఇక్కవివర్యుఁ డీ ప్రబంధమునందుఁగల ప్రథమద్వితీయాశ్వాసములను, శ్రీరామక్షేత్రాది దేవస్థానములలోఁ బ్రతిసంవత్సరము జరుగు శ్రీస్వామివారి కల్యాణమహోత్సవములలోఁ జోరోత్సవ సందర్భమున జోరసంవాదాశ్వాసమును, శ్రీ పుష్పయాగోత్సవసందర్భమున, లక్ష్మీనారాయణ సంవాదాశ్వాసమును, స్వామిసన్నిధానమందు విన్నపమొనర్చుట కర్హమగునటులరచించియున్నాఁడు. ఇట్లు శ్రీ స్వామివారి సన్నిధానమున విన్నప మొనర్చుటకే విరచించియున్న యీ యాశ్వాసద్వయమును, స్వాచార్యుల పురుషకారమున శ్రీ విజయనగర ప్రభువులయంగీ

కారమునంది, శ్రీ సింహాచల, శ్రీరామతీర్థాది దివ్యక్షేత్రములలోఁ బ్రతివత్సరమును జరుగు కల్యాణమహోత్సవములలో విన్నపమొనర్చుట కేర్పాటుగావించి కొన్నాడు. ఇప్పటికిని, దత్తత్సమయములయం దీ యాశ్వాసములనే విన్నపమొనర్చుట యాచారముగానున్నది. ఇందలి మూఁడవయాశ్వాసమును మాత్ర మిక్కవివరేణ్యుఁ డిటీవల స్వేచ్ఛగారచించి, యీ ప్రబంధమునందుఁ దృతీయాశ్వాసమని యాశ్వాసాంత్యగద్యమును వ్రాసి, యంటఁగలిపినట్లుగాఁ గన్పట్టుచున్నయది. కాని మొదటి యాశ్వాసములకు రెండింటికినిగల సమయ సందర్భములనుబట్టి చూచినచో నీమూఁడవ యాశ్వాసమున కీప్రబంధమునందు విశేషసంబంధమున్నట్లు గన్పడ లేదు.

మఱియు, నిప్పటికిలభించిన ప్రతులలో నీ ప్రబంధమునందు మొదటి యాశ్వాసమునకు "లక్ష్మీ నారాయణసంవాద"మనియు, రెండవ యాశ్వాసమునకుఁ "జారసంవాద"మనియు వాడుకచేయఁబడి లిఖింపఁబడియున్నవి. కాని యిట్టి వాడుకపేరులను, వ్రాఁతలనుబట్టి చూడఁగా నీ రెండాశ్వాసములునుఁబ్రత్యేకకైకాశ్వాప ప్రబంధములా ? లేక యీ యాశ్వాసములు రెండును మాత్రమే గలసిన యేకప్రబాధమా ? యేకప్రబంధమైనచో నిందేది మొదటి యాశ్వాసము ? ఏది రెండవ యాశ్వాసము ? ప్రబంధనామం బెద్ది? యను సంప్రశ్నముల కనువగునటుల లబ్ధప్రతులు వివిధములుగా వ్రాయఁబడి యున్నవి. యీవ్రాఁతల

యొక్క భేదములును, విశేషముగా నాశ్వాసాంత్యగద్యముల యందే గన్పట్టుచున్నయవి. ప్రతులన్నిటిలోను, ప్రబంధప్రారంభములుమాత్ర మొక్కరీతిగానే గన్పట్టుచున్నయవి. ఇట్టి వ్రాంత పొరపాటు లన్నియును, విలేఖరులయొక్క విజ్ఞానలోపము చేఁ గల్గిన వనియే యూహింపఁదగి యున్నది. ఈ ప్రబంధమునకుఁ గృత్యాదిపద్యము లెచ్చటను లభింపలేదు. కావున నీ హేతువులనుబట్టి చూడఁగా నీ ప్రబంధవిషయములో నైక్యక్రమనామనిర్ణయములను జేయుటకుఁ గొన్ని చర్చనీయాంశములు కలవుఁ కాని, గ్రంథవిస్తృతిసందేహముచే మానివేసి, పూర్వమునుండియు, వాడుకలోనున్న యాచారమునుబట్టియుఁ, ప్రబంధారంభోక్తరీతి ననుసరించియు, నిర్ణయాంశములనుమాత్రమే వ్రాయుచున్నాఁడ. ఇయ్యది మూఁడాశ్వాసములుగల ప్రబంధరాజము. ఇందుఁ బ్రథమాశ్వాసమునకు "లక్ష్మీనారాయణసంవాద" మనియు, ద్వితీయాశ్వాసమునకు "చోరసంవాదము"అనియు, వాడఁబడుచున్నవి. ఇక్కవీంద్రుఁ డీ యాశ్వాసత్రయవిశిష్టమగు నీ గ్రంథమునకు "లక్ష్మీనారాయణసంవాదము"అను నామమిడెను.

మఱియు నిందలి మొదటి యాశ్వాసములో శ్రీలక్ష్మీనానారాయణసంవాదమునుగుఱించి, వచింపవలసిన విశేషమేమియును, లేదుగాని రెండవ యాశ్వాసములోమాత్ర మీతఁడు శ్రీవైష్ణవసంప్రదాయముల ననుసరించి, శ్రీ తిరుమంగయాళ్వారుల చరిత్రమును జెప్పియున్నాఁడు. మనకు శ్రీ తిరుమంగయా

ళ్వారుల చరిత్రమొకింత తెలిసికొనవలసిన యావశ్యకత కలదు గావునఁ గొంత సంగ్రహముగాఁ దచ్చరిత్రమును వ్రాసి, ముగించుచున్నాఁడను.

## శ్రీ తిరుమంగయాళ్వారుల చరిత్రసంగ్రహము.

శ్లో॥ కార్తికే కృత్తికేజాతం చతుష్కవిశిఖామణిం
షట్ప్రబంధకృతం శార్ఙ్గమూర్తిం కలిహమాశ్రయే॥

శ్రీ తిరుమంగయాళ్వారులు చోళదేశమున తిరువాలితిరునగరిలో నలసంవత్సర కార్తికమాసములోఁ గృత్తికా నక్షత్రమందు శ్రీమన్నారాయణుని శార్ఙ్గాంశమువలన నవతరించెను.

ఈతఁడు "సమజాయత తత్రపాదజప్రముఖః కశ్చననీలః నామకః పురుషోత్తమ కార్ముకాంశజః" అను రీతిని శూద్రకులములో జన్మించినంత "ఆవినాడుడయార్" అను నీతని తండ్రి మంచి శుభదినమున నీతనికి, నీలుఁడని నామకరణమొనర్చెను. పుట్టినదిమొదలీ బాలకుఁడసమాన సౌందర్యవిరాజితుఁడై, యమితతేజశ్శాలియై, యత్యంత బలపరాక్రమసమన్వితుఁడై ప్రకాశించుచుండెను.

ఈతఁడొకసారి చోళదేశాధిపతిని దర్శింపఁగా నా రాజీతనియొక్క సౌందర్యమును, శౌర్యధైర్యములను, బలపరాక్రమములనుజూచి, యాశ్చర్యమునంది, యీతనికి "పరకాలుఁడు"

అను బిరుదనామము నొసంగి, తనకు సామంతరాజుగాఁ జేసికొనియెను.

అనంతర మీ పరకాలుఁడు తనకుఁ జోళరాజదత్తమగు రాజ్యమును, ధర్మమును, మేఱమీఱక, న్యాయముగాఁ బరిపాలించుచు, సకలసంపత్సమృద్ధితో సుఖంబుండెను. అంతట నచ్చట నాగపట్టణ సమీపమున గల "శ్వేతహ్రదము" అను తటాక తీరమున నొకానొక నాకవేశ్య, శాపవశమున మానవతరుణియై, సంచరించుచుండ నా పట్టణవాసియు, వైద్యపుంగవుఁడును నగు నొక శ్రీవైష్ణవోత్తముఁ డామెను దన కూతుగా గారవించి, తన యింటికిఁ దోడ్కొనివచ్చి, "కుముదవల్లి" యను నామమిడి, మిగుల గారాముగాఁ బెంచుచుండెను. అక్కన్యకారత్నమును, దినదినప్రవర్ధమానయై, మహాసౌందర్యలావణ్యయౌవనముల తో శోభిలుచుండెను. ఈ యువతీమణియొక్క సౌందర్యాది గుణవిశేషములను, విని, పరకాలుఁ డీమెను వివాహమాడఁ దలఁచి, యామె పెంపుడుతండ్రితోఁ బ్రసంగించినంత నాతఁడును, నా బాలికయొక్క సమ్మతిని గనుఁగొని, పరకాలునితో నిట్లనెను. "అయ్యా! యీ బిడ్డ నాకప్రయత్నముగా లభించెను. ఈమెను దమకిచ్చుట నాకు సమ్మతమేకాని, యీ బాలిక పంచసంస్కారసంపన్నునిదప్ప యితరుని జేఁబట్టననియు, వివాహానంతర మొకసంవత్సరమువఱకు ప్రతిదినమున అష్టోత్తరసహస్రసంఖ్యాకులైన శ్రీవైష్ణవోత్తములకుఁ దదీయారాధనము నొనర్చి, వారి శ్రీపాదతీర్థమును, స్వీకరించినఁగాని, భుజింప

ననియుఁ బ్రతినవట్టెను, గానఁ దామందుల కంగీకరించితి రేని దప్పక యీబాలికామణిని బెండ్లియాడవచ్చును." అని చెప్పెను.

పరకాలుఁ డందుల కెంతయు సంతసించి, "ఆరాధనానాం సర్వేషాం విష్ణోరారాధనం పరం, తస్మాత్పరతరం ప్రోక్తం తదీయారాధనం మునే" అను సూక్తిని సంస్మరించి, సమ్మతించి, మంచి శుభదినమునఁ బూర్ణదేశికుఁడను నాచార్యునివలనఁ బంచసంస్కారముల నంది, కుముదవల్లిని బరిణయమాడెను.

తదనంతరము కుముదవల్లీ ప్రతిజ్ఞానిర్వహణము నొనర్పఁ బూని, పరకాలుఁడు తనధనాగారములోఁ గల ద్రవ్యమంతయు, వ్యయపరచుచు, నిత్యము శ్రీవైష్ణవోత్తములకు, షడ్రసోపేత భోజనములనిడుచు, నారాధించుచుండెను. స్వల్పకాలములోనే తనధనమంతయు, వ్యయముకాఁగాఁ జోళభూపతి కీయవలసిన సొమ్మునుగూడ వెచ్చించి, కప్పమును జెల్లింపక సమారాధనమును, సాగించుచునే యుండెను.

చోళభూపతి కీవృత్తాంతముఁ దెలిసి, తనకు సామంతరాజై యుండియు, నిర్ణీతమగు కప్పముచుగట్టక, దుర్నయముగాఁ బ్రవర్తించుచున్న పరకాలునిపై, మిగులఁ గోపించి, భండనముఁ జేయ భటులను బంపెను.

పరకాలుఁడును, మిగుల బలపరాక్రమములను, జూపి, చోళభూపతియొక్క సేనలనుఁ జెండాడి, విజయలక్ష్మివిభాసితుఁ డాయెను, అనంతరము చోళమహీపతి పరకాలునిపై దండెత్తి

యేడుపర్యాయములిటుల తనసేనలను బంపుటయు, బరకాలుఁడే విజయమునందుటయు, జరుగఁగాఁ దుదకు దానే స్వయముగాఁ బరకాలునితో యుద్ధముఁజేయ నారంభించెను, గాని యపుడును, జోళరాజే పరాజితుఁడై పరకాలునితో సామముగా మాటలాడి, తనకీయవలసిన ద్రవ్యమిమ్మని కోరఁగాఁ బరకాలుఁడు మూఁడుదినములలో ద్రవ్యమంతయు నిచ్చుట కొప్పుకొనెను.

అటులంగీకరించిన పిదపఁ బరకాలుఁడు తనవద్ద నొక్కపమ్మిడియైనను, లేనందులకుఁ జింతించుచు, నుపవసించి, భగవంతునే ధ్యానించుచుండెను.

అంతనారాత్రి యామహామహుని స్వప్నములోఁ గరిరాజరక్షకుఁడగు కరిగిరివరదుఁడు సందర్శనమొసంగి. “కాంచీపురములో, వేగవతీనదీతీరమున నొక్క నిక్షేపముకలదు. దానిం గొని, చోళరాజు ఋణమును దీర్పుము”అని యీవిధముగా నానతిచ్చి, యంతర్ధానము నందెను. పిమ్మటఁ బరకాలుఁడును మిగుల సంతసించి, యావిధముగా నొనర్చి, ఋణవిముక్తుఁడై, తనకొసంగిన సామంతరాజ్యమును గూడ మగుడరాజున కప్పగించి, స్వాధీనపఱచివేసెను.

ఈవిధమునఁ గొంతకాలము గడచినపిమ్మట పరకాలుఁడు,

"ఇంటిలోనున్న సొమ్ముల్లఁ జెల్లినవైష్ణ
వారాధనాపేక్ష నాఘనుండు
నీలికాసెబిగించి డాలుకత్తిధరించి
కేలవిల్లమ్ములు లీలఁబాల్చి
దొంగబంట్లకునెల్ల దొరయయిభేరికా
భూరికాహాళములు భోరుకలుగఁ
ద్రోవలలోఁ గాచి దొరలసంపన్నులఁ
దెరవాట్లుగొని కొట్టి తెచ్చినట్టి
నవధనంబు సహస్రవైష్ణవులకనుది
నంబు సంతర్పణముసేయఁ"

గుముదవల్లికిఁ బంపుచుండి, తానీమహారణ్యములోనే చౌర్యముల నొనర్చుచు నుండెను.

ఇట్లుండ నొక్కనాడాయరణ్య మార్గమున నెవ్వరును, రానందునఁ బరకాలున కొక్కపైసయైనను, లభింపక

"అహాహ! యెవ్వరుఁ ద్రోవరారై రటంచు"
జింతించుచు, "నొక్కపొడుగుమహీరుహం, బెక్కిచూచె"
"అపుడు తిరుమంగయాళ్వారి, యందుఁ గరుణ
సామిన్నపురీతిఁ దాదోఁపొసంగఁ దలఁచి."

సపరివారముగా శ్రీమన్నారాయణుఁడు పెండ్లికొడుకు వేసముతో "ప్రకటహాటకరత్న మకుటహారాంగద కటకాది

చాకచక్యముల”తోడ నయ్యరణ్యమార్గమునుండి బయలుదేరెను, ఆవిధముగా నమూల్యాభరణములతోడను, విశేషధనరాసులతోడను, సపరిజనము గావచ్చుచున్నట్టి “సామిఁగని, పెండ్లికొడుకని, జవమెసంగ, ధనముగల్గెడు వైష్ణవ, తతికొసంగ” ననుచు నమ్మేటిదొంగ తనపరివారముతోఁ గూడి, పెండ్లికొమరుని పరివారము నడ్డగించి, యాక్రమించి, సొమ్ములల్ల దోచుకొనెను. అట్లు దోచుకొనిన సొమ్మంతయు బర్వతమువలెఁ బడియున్నదిగాని, పరకాలునకుఁగాని భటులకుఁగాని, కదల్చుటకుఁ గూడ శక్యముకాలేదు. పరకాలుఁ డేమిచేయఁగలఁడు? మిగులవిచారించి, పురోహితరూపధారియైయున్న బ్రహ్మనుగని, “ఓయిబాపఁడా! నీవే యీసొమ్మును గదల్పలేకుండునట్లు మంత్రించితివి. నీవు మంత్రవాదివిగాఁ గన్పట్టుచున్నావు. నీమంత్రము నుపసంహరించెదవా? లేదా?”యని తలపగులఁ గొట్టఁబోయెను. అపుడు పెండ్లికొమరుని వేసముతోనున్న శ్రీమన్నారాయణుఁడు పరకాలునిఁగని, “వత్సా! ఆగుము! నేనేమంత్రించితిని, నీకుఁగావలసిన మంత్రమును నేనే యుపదేశింతు నిటురమ్మ”ని పిలువఁగాఁ బరకాలుఁడత్యంత భక్తితాత్పర్యములతోఁ బెండ్లికొమరునిచెంతనిలువఁబడెను. అంతనమ్మహానుభావుండును, విశేషకటాక్షముఁ జేసి, యాపరకాలునకు, “అష్టాక్షరమహామంత్రము” నుపదేశించి, గరుడవాహనారూఢుఁడై శ్రీభూనీళాసమేతుఁడై, దివ్యదర్శన మొసంగెను.

మహాభక్తుండైన పరకాలుండా శ్రీమన్నారాయణుని సేవించి, మెంతయు, భక్తిభావమునం దక్షిణముననే ద్రవిడభాషామయ ప్రబంధబంధురముగా ననేకరీతుల స్తుతింపసాగెను.

భక్తాగ్రేసరుండైన పరకాలుని స్తోత్రములకు సంతుష్టాంతరంగుండై శ్రీరంగనాథుండు "వత్సా! నీభక్తికిని, భాగవతారాధనాసక్తికిని, స్తోత్రానురక్తికిని, మిగుల సంతసించితిని, గావున నే నీదినమున నన్నను గ్రహించిన యీవృత్తాంతము శాశ్వతముగా నీలోకమున వాడుకలోనుండులాగున నాయాలయములలో నెల్లెడలను, కల్యాణోత్సవములలో నశ్వవాహనారూఢుండనగుచున్న, నీవునిరోధించి నాసర్వస్వమును, దొంగిలించునటుల నొకయుత్సవము నేర్పాటుచేయుచున్నాండను" అని యానతిచ్చి, యంతర్హితుం డాయెను.

శ్లో. తదాప్రభృతివేదాంతిన్ హరిణాంగీకృతంభువి
పరకాలకృతం హ్యేతద్ధనాపహరణోత్సవం
సర్వస్థలేషుసర్వత్ర చోత్సవేష్వశ్వవాహనే
అతస్సర్వేశ్వర స్సర్వస్థలేషుచ మహోత్సవే

తురంగవాహదివసేకృపయా భక్తవత్సలః
సర్వస్వదానమద్యాపి కరోతికలివైరిణే
ఏతంచోరోత్సవం చిత్రం యేసేవకతే నరోత్తమాః
తేషాం రంగేశ్వర శ్శీఘ్రం సుప్రసన్నోభవిష్యతి."

అని ప్రపన్నామృత పురాణమునఁ జెప్పఁబడియున్నట్లు యీయుత్సవమే "చోరోత్సవము" అని ప్రసిద్ధమైనదై, శుభప్రదమనియు, భగవత్ప్రీతికరమైనదనియు, సర్వవిదితమైయున్నది.

ఇట్లు సుప్రసన్నుఁడైన శ్రీరంగనాథుని గనులార సేవించి, ధన్యుఁడై, తిరుమంగయాళ్వారు తా నొనర్చుచున్న శ్రీవైష్ణవారాధనవ్రతమును, బూర్తిచేసి, కృతార్థుఁడాయెను.

అనంతరము కుముదవల్లీసమేతుఁడై, తిరుమంగయాళ్వారు శ్రీరంగమున నివాసమేర్పఱచుకొని, శ్రీరంగనాథదేవాలయమున కనేక గోపురప్రాకారాదులను, గట్టించి, కైంకర్యమొనర్చెను. ద్రవిడవేదమునకు, షడంగములనఁదగునారు ద్రవిడదివ్య ప్రబంధములను, రచించి, యీలీలావిభూతియందు 105 సంవత్సరములు జీవించి, యనంతరము పరమపదమున కరిగి, స్వస్వరూపము నందెను.

కూర్మనాథకవీంద్రుఁ డీ చరిత్రాంశము నే యవసరమైనంతవఱకు సంగ్రహించి, సరసమగు శైలితో, సంప్రదాయాంశములను, సమకూర్చి, సమీచీనముగా నింపువర్ణించియున్నాఁడు.

శ్రీరామ తీర్థపర్వతముపైనున్న దర్శనీయస్థలములను వర్ణించుచు నీతఁడనేకములగు చాటువులను జెప్పియున్నాఁడని, ఆదుర్తి అప్పలనరసింహంపంతులుగారు చెప్పియున్నారని యిదివఱలోనే వ్రాసియున్నాఁడను, గాని, ఆయనవారియొద్ద నొకపద్య

ములో నొక్క పాదమే చదివి విన్పించినారు, ఆపద్యపాదము నిట నుల్లేఖించుచున్నాఁడను.

సీ. "ఇఱుకురాయిది దొంగ, దొరకురా వెదుకంగ
పలుకురాయదిమాఱు, పలుకునిచట"

ఇఱుకురాయి, పలుకురాయి, పాండవులపంచలు, సీత కుండము, రామకుండము, మొదలగుననేక విచిత్రదృశ్యముల నితఁ డీవిధముగానే వర్ణించియున్నాఁడని జనశ్రుతికలదు.

ఈగ్రంథరాజమున కుపోద్ఘాతము వ్రాయునవకాశము నాకు కలిగించినందులకు యీ యాంధ్రవిజ్ఞానసమితి యధ్యక్షులవారికి నాకృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచు, నితోధికముగ నిట్టిగ్రంథపదంపర నాంధ్రమున వెలయింపజేయుదురని యాశించుచున్నాడను.

ఇట్లు,

శ్రీరామతీర్థము వృష, జ్యేష్ఠ, శు. పూర్ణిమా సోమవారము 9—6—1941.

బుధజన విధేయుఁడు,
కవితావతంస గానకళానిపుణ,
కరి నారాయణాచార్యులు
భాగవతార్.

# శ్రీ లక్ష్మీనారాయణ సంవాదము

## ప్రథమాశ్వాసము.



క. అతులపదరేణు దూళి
కృత గౌతమమౌని సుందరీపాషాణా!
కృతికిన్ గృతికృతకథనా
కృతికిన్ శ్రీరామతీర్థగిరిరఘుపతికిన్.

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన లక్ష్మీనారాయణ సం
వాదంబను మహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

సీ. తనమనస్సంకల్ప వనరాశి కబ్జజాం
డములు లీలాబుద్బుదములు గాఁగఁ
దనకథాజ్యోత్స్నకు సనకాది ఘనయోగి
సముదయంబులు చకోరములు గాఁగఁ
దనదివ్యతేజోగ్ని కనలహరిత్తురం
గములు పటుస్ఫులింగములు గాఁగఁ
దనదు మాయావినూతన తిరస్కరిణికిఁ
బ్రాణికోటులు సాలభంజికలుగ

గీ. నలరు జగదీశుఁ డభినుతాజాభ్ర కేశుఁ
డాది మధ్యాంతరహితుఁ డాహ్లాదహేతు
వప్రమేయుండు జలధర శ్రీప్రకాయుఁ
డమరరిపుమర్దనుండు జనార్దనుండు.

వ. అట్టి నారాయణుండు సమస్తలోక రక్షణంబుసేయుచు, భక్త పరిపాలన కుతూహలంబునం దనివితీరక, యనేక దివ్యదేశం బులందు మర్త్యావతారంబు నొందుచుండి, విశేషించి శ్రీరామతీర్థగిరియందు లక్ష్మీసమేతుండై భక్తుల మనోరథంబు దీర్చుచుండి, యొక్కనాఁడు.

సీ. మొయిలుపై రవిలాగు హొయలుగా శిరమున
బంగరు నెఱరంగు పాగఁజుట్టి,
యుష్ణాంశు తరుణారుణోత్కిరణముగతి
రంగగు కెంపు తురాయిఁబూని,
యంతర్గ కరుణారసౌఘంబు పైనుండె
ననఁ గుసుంభావన్నె యంగిఁదొడిగి,
కడుపులో జగములు కదలకుండఁగఁబట్టి
చుట్టినట్టుగ నడికట్టుఁగట్టి,

గీ. బాఁకు మొలఁజెక్కి వాహ్యాళిపై ముదమున
కలిమి జవరాలి కిట్లనెఁ గప్పురంపు
విడెముసేయుచు ముత్తెంపుఁ వింతచెవులఁ
జొకటుల తేటఁజెక్కిళ్లఁ జొకళింప.

క. నారీమణి నే నిప్పుడు
స్వారీ వేంచేసివత్తు; సమ్మతిచేతో
దూరీకృత వ్యథయగు మా
శారికీరప్రసంగ చాతుర్యమునన్.

ఉ. నావుడు చిన్నవోయి లలనామణియుల్లము ఝల్లనంగఁజే
తోవిభుఁజూచి బాష్పములుదొంతరగాఁగను రెప్పలార్చుచున్
భావజుఁడాత్మపాణిగ కృపాణిఁ గడుంఝళిపించు కైవడిన్
మైవణకంగ నిట్లనె సమ్మాకుల కోకిల కాకలీధ్వనిన్.

చ. కలనయినన్ క్షణంబయినఁ గట్టిగ నన్నెడఁబాయఁజాల దీ
చెలియయటంచు లోనెనరుఁజెందినఁగాక! మహాత్మ! మిమ్ము నే
వలదన నెంతదానను; భవత్కృప నెవ్వరికైన నెంతగా
వలయునొ, యంతనా, హృదయవల్లభ! నాకొఱకింత యేట్లికిన్.

వ. అని గన్నీరునించు మున్నీరుపట్టి చుబుకంబువట్టి, బ్రతిమాలి యిట్లనియె.

గీ. ఇట్టులాడంగఁదగునె నీయట్టిచెలికి ?
నిట్టె తిరువీధికేగి నే నిపుడెవత్తు
గట్టిగానమ్ము మని బాలఁ గౌఁగలించెఁ
జుట్టు కైదువగలదిట్ట సొగసులుట్ట.

శా. రాజీవాక్షుఁడు భక్తసంతతులతో రాజైకరాజచ్ఛమూ
రాజీమధ్యమునందు మర్దల ముఖారావంబుతో లాస్యముల్
రాజిల్లన్ వగనాటపిట్టగతి ధారాపంచకాధారమా
తేజీనెక్కి వినోదలీలఁ దిరువీధిన్ స్వారి వేంచేసినన్.

సీ. మొల్లపూలేనవ్వు లుల్లసిల్లినలీల
మల్లెపూసేసలుఁ జల్లిచల్లి
కన్నులన్ను లొనర్చువన్నె జెన్నలరారఁ
గప్పురంపు నివాళిఁ ద్రిప్పిత్రిప్పి
కెమ్మోమ్ములందిచ్చు క్రియఁబంచదార లిం
పెసఁగ నైవేద్యంబు లిచ్చియిచ్చి
రాసకేళు లొనర్చు రహిఁబ్రదక్షిణములఁ
జక్కనౌ మ్రొక్కులు మ్రొక్కిమ్రొక్కి
గీ. వ్రజయువతులట్లు యప్సరవారసతులు
చెలఁగి యాటలఁబాటల సేవఁజేసి
రాష్ట్రవర్గముతోడ విహారలీల
నిందిరాభర్త తిరుపీథు లేగువేళ.

వ. అంతనిక్కడ.

చ. కలుముల ముద్దరాలు పతిఁగన్నులఁ జూడక సోలుతమ్మితే
యలరులఁబోలునెమ్మొగమునందు నుతింపఁగఁజాలుముంగురుల్
చలదళులంచుఁ దోలుఁ జెలలంబతిమాలుఁ గృపావిశాలు, నా
చెలువుని భక్తపాలు ఘనశీలునిఁ దెమ్మని వ్రాలు నంతటన్.

చ. చిగురుజిరాధరించి, విరిసింగిణి నారిబిగించి, తమ్మివాల్
దగద్గుళిపించి, రాచిలుక తత్తడిపై దుమికించి, కల్వము
ల్కిగములముంచి,మిక్కిలినళించి,మరుండకటా! ఖసెల్లునన్
మొగలి కటారిచేఁబొడిచె ముద్దియగద్దియమీఁదవ్రాలఁగన్.

## ప్రథమాశ్వాసము.

క. అంతఁ బ్రియకాంత లంత
స్సంతాపమరంతచింతసంతానవనా
క్రాంతసుమసంతతులచే
వింతగ శిశిరోపచారవిధు లొనరింపన్.

ఉ. చిత్తరిలేచి యుస్సురని చీరము దూరముగాఁగఁగామినీ
చిత్తముఁ గూర్పరేయనుచుఁ జిత్తము తత్తరపాటునొంద డ
గ్గుత్తికతోడఁబల్కు పలుకుల్ ములుకుల్వలె నాటినన్ జెలుల్
హత్తగనుల్కివచ్చె హరియంచునొడంబడఁబల్కిరయ్యెడన్.

ఆ. కాముతల్లి పాలకడలికూతురు లక్ష్మి
స్వామివేఁటకేగి జాగుసేయ
గృహము మేనలంకరించి చెక్కిటఁజేయి
గదుర నూఁదలంచి గడపనుండె.

చ. జలరుహబాణకోటి నెకసక్కెము లాడెడు వన్నెకాఁడుఁ జె
న్నలరెడు గొల్లకన్నియల నాత్మలుగొల్లలు కొన్నతేఁడు మ
ర్దలకలగీతనాట్యచతురప్రమదాతతి నేలువాఁడు ని
శ్చలకృపతోడవచ్చె నలశౌరి రమాంగనయున్న యింటికిన్.

చ. పరవనితాంగరాగరసభవ్యతరోచితరోచివచ్చు న
య్యురగశయానుఁజూచి, తలయూఁచిబిరాలునలేచితల్పు వే
గిరమునవైచి, శయ్యదిగిక్రృష్ణునిఁ దామరలంగఁజూచి, యిం
దిర బహిరంగణస్థుఁడగు దేవునిఁజూచి, పునఃపునారతిన్.

చ. అటువలె వింతదారి, దనుజారి వినోదముమీరి, నారద
స్ఫుటతరగీయమానగుణ ! భూరియశోగణహారి గోపికా
విటుఁడయిచేరి గోపికల వెంట మహోత్సవ కేళిఁ దేరి యే
మిట రోదయయ్యె నీజగడమేమని యబ్బురమందె పల్కెనన్.

చ. కమలదళాక్ష !నమ్మమిది కాదుర దానిగృహమ్మె!మిమ్మనె
య్యమునఁ గరంగఁజేసిన ప్రియాంగనయిచ్చటలేదుపొమ్ము!స
త్యమిది మదీయమైన నిలయమ్ముక్షణమ్ము భవద్వినోదమిం
దమరదు లెమ్ము!వంచనపరాత్మక!యవ్వగలాడి యింటికిన్.

ఉ. పల్లవపాణి ! యిప్పగిదిఁ బల్కఁగఁజెల్లునె? తేజమైవిరా
జిల్లు విహంగరాజు విలసిల్లు జగంబులు కుక్షియందు వ
ర్తిల్లు సమస్తరాక్షసతతి న్వధియించఁగ మాకుఁజెల్లు ని
క్కెల్లడనొప్పు మాకుఁదగునిల్లు రమాంగన వక్షమేగదా !

వ. అని యప్పుడు.

ఉ. తళతళలాడు రత్నములు దాపినకుందనపుం జగానగల్
విలువలులేనిచీరెలు నవీనకళాంచిత కంచుకంబులున్
కలితసమస్తవస్తువులు కానుక భక్తులచేతఁ బ్రేమతోఁ
జెలువుఁడుపంపె లక్ష్మిదరిఁజేరి యొసంగిరివారు నమ్రులై.

ఉ. కానుక లట్లుదెచ్చి సముఖంబున నుంచిన విష్ణుసేవలన్
మానిని కిచ్చతోఁ దులసి మంజరులన్ దగుతాడనంబులన్
దా నిలువెల్లఁద్రోచి, మృగనాభిజవాదియు గంధసారమున్
గానవరత్నభూషలును గానుక సామికిఁబంపె లక్ష్మియున్.

క. మానవతి పెట్టిపంపిన
కానుక లాదీన కల్పకంబగు హరి భ
క్తా నీకంబులకొసఁగి మ
హానుగ్రహ మెసఁగ మఱియు నభిమతమిచ్చెన్.

వ. అంత మున్నీరుగన్న కన్నియ వెన్నున కిట్లనియె.

సీ. నన్నొంటిదిగనాడి వన్నెకాండ్రనుగూడి
తగనిదిక్కులకేఁగఁ దగునటోయి!
పరకాంతలనుజేరి ప్రాకృతసుఖమొంది
తగవుమాలి వసింపఁ దగునటోయి!
జారవృత్తికిఁజొచ్చి సజ్జనగతివచ్చి
నగుఁబాటుగతిఁగనఁ దగునటోయి!
సకలామరుల నేలిసదయుఁడ వనఁజాలి!
వెగటుచుల్కనబుద్ధి తగునటోయి!

గీ. వగలుమిగిలినచేష్టల నెగడు గొల్ల
సొగసుకత్తెలవలఁజిక్కిఁ స్రుక్కిదక్కి
మగుడమాచెంతఁజేరుట దగునటోయి!
కాముకాధీశ! ప్రాణేశ! ఖలవినాశ!

సీ. ఇంతి! నీపయిఁ బ్రేమ నింటికివచ్చిన
నన్నాదుకొన విదిన్యాయమఁటవె?
రమణి! యించుకయపరాధంబుసేయని
నన్ను నిందించుట వన్నెయఁటవె?

కాంత ! నాపై వృథాఽింతభావముదోఁచి
యింతకోపము సేయఁ బంతమేఁటవె ?
మగువ ! యెన్నఁడు నరమర లేకన నటించు
మనలోన రొసరొసల్ మంచిదటవె ?

గీ. కమలవాసిని ! కమలాక్షి ! కమలగంధి !
కమల ! కమలారిముఖమనఃకమలసీమ !
తగు నెనరు నిల్పవలెఁగాక; తగునె ? వట్టి
యలుక లిటుఁబూనఁ జిలుకలకొలికి! కాన.

మ. భువిలోనం బలవంతు లెట్టిదురితంబుల్ జేసిన న్వారిపు
ణ్యావిశేషంబులటందు రాస్వజనులాహా ! దేవ! బ్రహ్మాండక
ర్తవు నీ వెట్లునటించినం దగవుకాదా ? యెక్కడన్ రాజుల
న్న వచోవృత్తి వెదుళ్ల పందిరియుఁ దిన్నంగాదె? ప్రాణేశ్వరా!

ఉ. ఈనెరవాదిమాటలిఁక నేటికినేటికి మాటిమాటికిన్
గాననదుష్టజంతుహతికై మతిగైకొని వేఁటలాడుచున్
సేనలతోడ నెండఁబడి చిక్కితి స్రుక్కితి నీకు దక్కితిన్
గానఁగరాదె ? లేదె ? కనికారము నేరములేమె ? కోమలీ !

ఉ. వేఁటలకేగినానసుచు వేమరుబల్కెదు బూటకంబు ప
ల్మాటల సంతసిల్లు ! హానుమన్ముఖకాంతలఁగూడి వేడుకన్
వేఁటలఁదోటలం దిరుగువేళల నోలలనామనోజ ! నీ
కేటికిఁ గల్గెనోయి! మెయి నిమ్మయి నెమ్మెయిజారచిహ్నముల్.

ఉ. మించితివల్కఁ జేఁ గను భ్రమించిన నన్వెరపించె దీవు కొ
ట్టించితిభక్తులన్ బ్రతిఘటించితి సేవకురాఁగ వీథిలో
నుంచితి వెల్లవేల్పులనయో! వినయోచితరీతినుండు నే
మంచితనంబులెందుఁజనె మంచిది ! మంచిది లే తలోదరీ !

ఉ. తామరసాక్షు! బాగు ! మదితప్పులు నీయెడ లేకయున్నచో
నేమిర ! యింతజాగు; తమినిందుని వెన్నెల నీరదంబు సౌ
దామినిలాగు నిన్నతిముదంబున బాయక పిల్లునీఁగు న
న్నీమదనార్తి నేఁగుమని యెచ్చటనుంటివిరా ! మనోహరా !

ఉ. కామిని ! యీజగంబులను గానన భూములు విప్రదేవతా
గోమృగపీడఁ జేసెడు నకుంఠిత విక్రమరావణాదిదై
త్యామితదుష్టసత్వముల నాలము వేఁటలకొట్టుటంజుమీ
దామఱి యీవిలంబగతిఁదక్కిన సంశయమెల్లమానుమీ !

సీ. తబ్బిబ్బులేమని నిబ్బరంబుగ వ్రేయు
నలదానిజడ దెబ్బలంటకున్న
వదలకు నన్నని గదిమి యామదవతి
కుచయుగమ్మున రొమ్ము గ్రుమ్మకున్న
నిల్లువెళ్లకు మని యల్లఁ జందనగంధి
బాహువల్లులఁ గట్టఁ బడకయున్న
మరుకేళిఁగేరి యావిరిబోఁడి నినుఁబట్టి
ననసెజ్జ సరిబారిఁ బెనఁగకున్న

గీ. నెట్లు విలసిల్లు నీమేన నీజివాది
వలపుఁగస్తురివాసన మలయజంబు
పరిమళము మల్లెవిరజాజి విరులతావి
సిద్ధమగునోయి! యీరేయి శేషశాయి!

సీ. సతులకీల్జడ లంట జవ్వాదిగా దిది
అడవిఁ జెంచులొసంగు నదియెకాని
కాంతలచనుదోయి కస్తూరి గా దిది
ఆత్మభక్తులొసంగు నదియగాని
గజగామినులొసంగు గంధంబుగా దిది
యలమౌనులర్పించు నదియకాని
వెలఁదులసెజ్జల విరులవాసనగాదు
మఘవపూజితకల్ప మహిమగాని

గీ. యెన్ని నేర్చితివేకొమ్మ! యెన్నఁడెరుఁగ
నెవతె సెప్పెనొ కొండెంబు లింతి నీకుఁ
జలముమానవె! యికనైన చపలనయన!
యిట్టులనరాదు నాయందు నెగ్గులేదు.

ఉ. సరిపడబొంకినావు భళి! జాణవు లేనగు ముత్తియంబుచే
వరలిన విద్రుమంబువలె వర్తిలువాతెర చిల్కబింబమున్
గొరికినలాగు కెంజిగురుఁ గోకిలచక్కఁగ నొక్కుపోలికన్
కరము జెలంగెనోయి! పలుగం టిది యేమిఁక ప్రాణనాయకా!

చ. నను వెఱపించఁగా దలఁచి నవ్వులకంటివిగాక నీవెఱుం
గని పలుగంటు నా కెచటఁ గల్గె ? సమస్తమునీంద్రదేవతా
జనములఁ బ్రోవ రాక్షసులు చంచలమొందఁగఁ బాంచజన్యమొ
త్తినసిధరంబుపై నొరపు దేర నయారమయారి! చూడవే!

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనిసామిగ ! నీదుమేనిపై
చక్కెరవిల్తు వింటికొనసాయగ, మోదుగమొగ్గతళ్కునన్
జొక్కపు లేఁతచందురునిసొంపులతో నెలవంకగుంపు నీ
కెక్కడఁ గల్గెనోయి! మెయినెమ్మొయి? వేఁటఁ జరించువారికిన్

ఉ. ఎక్కడ నేర్చుకుంటి వి పుడీబలుచిక్కులు పెక్కుచోద్యపున్
వాక్కులు వేటలోన మృగవారము ఘోరముగాఁగఁ గానలో
నెక్కుడు లావుతోడఁ బరువెత్తఁగఁ దోఁ బరువెత్తువేళలో
నక్కట ! కంటకాంకురములం బెఁగదే ! జగదేకసుందరీ !

ఉ. జగములచేత మ్రొక్కఁగను సామినిగా యరచందమామ సో
యగము వహించు నీనుదుటియందున నీలపుమానికంబువై
నిగనిగలాడు కెంపుకరణిం దగె లత్తుకపాదమెట్లు దాఁ
దగిలె యదార్థవాదివిగదా! శలవిమ్మది ప్రాణవల్లభా.

ఉ. కడుధనవంతుఁ డందరికిఁ గల్గుధనంబులఁ గొన్నలాగు నీ
యడుగులచేతలందగు నఖావళిలత్తుకచాయ జూడఁగాఁ
బడుట శుభాంకసంకలితపంకజరాగ కిరీటకాంతి బ
ల్విడ నొసలంట లత్తుకని వింతగఁ బల్కెదు దంతిగామినీ !

గీ. నారికేడ మెందుకెక్కి తనంగ దూడ
గడ్డికన్నట్టు నీబొంకు గానఁబడియె
వేఁటకేగెడువారికి నేటికలరు
నచ్చరలక్ష్మమగు కుంకుమాంక మీశ !

గీ. వినవె ! మోహబాల ! చలమేల ? వేదశీల !
వరులు గావించు చూర్ణోత్సవంబువేళ
ప్రమోలసురజాల మవలీలఁ గోలబూని
చాలఁ గుంకుమ జల్లుకో మేలమునకు.

ఉ. కందనియన్నుమిన్న గసికందని నీవదనంబునందు గో
వింద! మరందబిందు లరవిందమునం దడుచొందు చంద మిం
పొంద శ్రమాంబుబృందమిరువొందెవిదెందునఁ జెందియుందు వే
చందనగంధులకా దగులుసందడి మందునకైన లేవిచో.

శా. నామాటల్ వినిమానినీమణి! యిటుల్ నాపై రవాళింప వే
మోమాటల్ మదిమాని,భక్తులగృహంబుల్ జేరికాన్కల్ గొనన్
మేమాటాడినలాగు వేఁజనఁగడాల్మేల్ ఛత్రముల్ గూడఁ శ్రీ
వ్యోమాటేశులతోడనాడఁబడఁగానొందెన్మెయిం జెమ్మటల్.

ఉ. కల్లయొకింతలేదుగద! కాంతుఁడ! నీయెడ గొల్లవేరటాం
డ్రెల్ల నలందుఁ జాయపసుపెల్లెడ నీవలువెల్ల నిండె నేఁ
జెల్లఁ గడానికాంతివిలసిల్లు తటిత్కళలుల్ల సిల్ల నీ
చిల్లరచేష్టచేసి తనఁజెల్లునె? యెక్కడఁ దారసిల్లునో శ్రీ.

# శ్రీలక్ష్మీనారాయణ సంవాదము



## ద్వితీయాశ్వాసము.

---

క. శ్రీజానకీ కుచశ్రీ
భ్రాజిత శ్రీరామతీర్థ పర్వతధామా!
తేజోజితోష్ణధామా!
రాజితసుగుణాభిరామ! రాఘవరామా!

కం. ఈరీతి వేడ్క లక్ష్మీ
నారాయణు లఖిలలోకనాటకలీలా
పారీణులై చెలంగుచు
ధారుణి భక్తప్రసన్నతాగతి నుండన్.

భుజంగప్రయాతము.

వసంతర్తు వత్యంత వల్యంత సంతా
న సద్భృంగ సంగీతనాదద్రవ ద్భూ
జ సంస్పృష్టమారంద జాలాంచితారా
మసౌరభ్యయుగ్దిక్క మంబై చెలంగెన్.

మగువ ! కుండలనీలమాణిక్యరుచిగాని
చెక్కిళ్ళఁ గస్తూరి చెన్నుగాదు
కాంత ! కౌస్తుభరత్నకాంతిసంతతిగాని
యురమునఁ గర్పూరము౦కిలేదు
గీ. మించుబోణులు కలహంబు పెంచఁదలఁచి
చేరి యేమేమికలహముల్ సెప్పినారొ ?
యాడఁగారానిపలుమాట లాడె దీవు
ముద్దరాలవుగదె ? కొమ్మ ! ముద్దుగుమ్మ !

చ. కడవడి నేమిటూరి నినుఁ గౌఁగిటఁబట్టి బిగించి చెక్కుము
ద్దిడుకొనె సామి ! యద్దముపయిన్ నెఱిలత్తుక యద్దినట్లుగా
విడియపురంగుసోఁకెఁ జనవేధకు దానిఁ దొలంగివచ్చుటల్
వెడవిలుకాఁడు నాటుకొనవేసిన మంకెనపూవుఁదూఁపనన్.

ఉ. చందనగంధి! భక్తులు వసంతమహోత్సవవేళ జాభరా
గంధముపూయఁ జిందివడెఁ గాదటె? చెక్కిట దీనిఁ దమ్మికా
రందురె? వెండిచూచి భ్రమసందుచు ముత్తెపుచిప్పటన్నరీ
తిందగు ముద్దరాలవుగదే తగదే ! జగదేకసుందరీ !

క. మేలా ? యీలాటివచో
జాలామితలీల ! నమ్మఁజాల యశోదా
బాలా ! గోపాలా భూ
పాలా తగుసాక్షి తెలియఁబల్కుమిఁకేలా.

మ. పదునూరుల్ గను దమ్ములున్న దొరసంపత్పూర్ణుఁడాచార్యుఁ డే
జదువుల్నేర్చినరీతి దక్షమతి సాక్షాదింద్రుఁడే సాక్షి! బా
ణదశాస్త్యాది వరప్రదాత, గిరిజానాథుండు ముక్కంటి సా
క్షి,దళత్తామరసాక్షి యీక్షితిఁ బరస్త్రీ వాంఛమానున్న దే.

ఉత్సాహ. కోడికూఁత గూసిమౌని కొమ్మఁ గూడి తెల్వఁ బో
నాడె నప్సరోవిటుండు నహుషుఁ డింద్రుఁ డర్ధనా
రీడితుండు భిక్షమెత్తె నెద్దునెక్కి గాంగమ్మత్
చూడుఁడంతకారి యెట్లు శూలిసాక్షి? యోహరీ!

సీ. చిలుకలకొల్కి యాశ్లిష్ట గుణోత్కృష్ట
శిష్టవర్యుండు వశిష్టు సాక్షి
జగదేకసుందరీ! నిగమార్థమెల్లనీ
జగతినిల్పిన వ్యాసులగును సాక్షి
సంపూర్ణ చంద్రాస్య! సాంద్రకళాజాల
రుద్రుఁడైనట్టి చంద్రుండుసాక్షి
నవలాలరత్నంబ! నవలాలితమహత్వ
ధవులైన పంచపాండవులుసాక్షి!

గీ. సాక్షి! తెలుసుకో! వామాక్షి! శిక్షఁ జేయు
తెరవ! యిటుగాక నీకాక దీరకున్న
బాహులతఁబట్టి కీల్జడఁ బట్టి కొట్టి
చెలియ! మఱి మమ్ము నీసొమ్ము చేసికొమ్ము

సీ. ఉపవాసములడస్సి నృపపురోహితుఁడైన
తపసి వేలుపుసావి దానికొడుకు
శ్రుతులు వెల్లడిచేసి రతినంబికాదులఁ
దగిలిన జాలారి దాని కొడుకు
గురుని యిల్లాలిచేఁగొని హెచ్చుగుంగుల
సందిజల్ రుచి తెల్లనైనవాఁడు
బొంకి వండుచు మొగపోడిమిలేక గు
ఱ్ఱాల గోవులఁగాచు లీలవార
గీ. లలవశిష్టుఁడు వ్యాసుండు నంబుజారి
పాండవులు సాక్షియనియెదు బాగుబాగు
కోఁరమేనత్తపై నెల్లగుత్తకొన్న
నీకె తగు; బాలగోపాల! లోకపాల!

చ. కలికి మిటారిసాక్షు లిటు కాదనిపల్కుతి నిట్టులైన ని
ర్మలతర శాస్త్రపద్ధతిఁ బ్రమాణమొనర్చెద నమ్మమిత్తరిన్
జలములజొత్తుఁ గుంభగతసర్పముఁబట్టుదు దీప్తవహ్నిలో
వెలఁగొనినిల్తు, నెట్టిఘనవస్తువుతోఁదులఁదూఁగియుండెదన్.

సీ. కడలేని వెడగు పాల్కడలిపైఁ బవళించఁ
గలనీకు జలముపై నిలుచుటెంత?
కళల రాజిలు వేయితలల కుండలిమీఁదఁ
బండు నీకొకశాముఁ బట్టుటెంత?

అతిపరమాణు కృశానలతేజంబు
వెలయు నీకగ్ని ప్రవేశమెంత
కడుపులో జగములు గలనీకు నెట్టివ
స్తువుతోఁ దగఁదులఁ దూఁగుటెంత
గీ. పరమపూరుష ! నీకేమి ? బాసలోయి !
వనమృగంబుల కగునె ? కౌత్వాల్దురాయి
చిహ్న లిటుమాని నీ విటు చిన్నవోయి
యున్నదనునేర మీరేయి యుదధిశాయి !
గీ. అంగజగురుండు యంగజయనెడువాక్య
సంగతులు విని బింకంబు సాగ దనుచు
గంగినేమని వేఁడక గడువ దనుచు
సరసిజాలయ కిట్లనె సరసఫణితి.
క. ఏహి విలస న్మితంబే !
దేహిముదం పదవినమ్ర విబుజకదంబే !
మోహిత శుకోష్ఠ బింబే!
పాహియనుచు రమణి లోకపతి బ్రతిమాలెన్.
వ. అని మఱియు లీలావినోదరసావేశంబున నిట్లనియె.
చ. తళుకుల దొంతి పూవిలతుదంతి కడానిసలాక, కేపురా
మొలకమెఱుంగుదీవ నునుముత్తెమ చక్కదనాలకుప్ప యొ
ప్పులగని ముద్దుగుమ్మ మరుపూచికిలీసురి ! కప్పురంపుమేల్
పలుకులదండ నన్నికఁ గృపాయుతమా కడకంటఁ జూడవే !

సీ. విచికిలగంధి నీ కచమేచకరుచులు
చకచకల్ కటికచీఁకటులఁ గాఱు
కొను ఘనాఘనముగా ఘనముగాఁ గనుఁజెప్ప
యొఱ జరాలున దూసి మెఱుఁగువాలు
ఝళిపించువీలున బెళుకుఁ జురుకుచూపు
మెఱసినట్లుగ మిరుమిట్లు గొలుపఁ
జెఱకుసింగాణివిబల్దొర యను ర్జన్య
డంపర జడివాన ముంప నీదు

గీ. శరణుఁబొందిన న న్నిలుఁ జొరకయుండ
బయలువెట్టితి వయ్యయో! దయదొలంగి
కుల్కుచక్కని బంగరుగుబ్బగోడుగు
లైన యొసఁగవె నమఁజేరి హా యొయారి!

సీ. బెళబెళలాడు దువ్వాలువపింజలు గిల్కు
టందెలు తుంపెసలాడు పతికి
రతి తనపెంపుడు రాచిల్కచే నంపు
నపరంజికమ్మ చుట్టనఁగఁ దళ్కు
దుళుకు నొడ్డాణంబుతోఁ గొను నసియాడ
కొబ్బరికుడకలు కొద్ది గలుగు
గుబ్బలహారముల్ గుదిగూడఁ గేతకి
యహిలాగు జడ లొడ లంటియాడఁ

గీ. కులుకుచూపులతో ముద్దుపలుకుతోడ
నెమరుగావచ్చి బిగిఁ గౌఁగలించి మెచ్చి
పడకటింటికి నను జెట్టఁబట్టి తెచ్చి
కోరికలదీర్చుఁగదె! ముద్దుగుమ్మ! కొమ్మ!

సీ. తొల్లింటి నెవరంటి తోడకు నీకడగంటి
కులుకు చల్లనిచూపుఁ గోరుకొంటి
జుంటితేనియమోవి పంటిపైఁ బలుగంటి
నొవరించ వాస నోరూరుచుంటి
చంటిపైఁ గొనగోరు లంట నొక్కఁగనుంటి
ననవిల్తు తమిని మాట్లాడుచుంటి
పసిఁడియనంటి కంబమువంటి తళుకంటి
మెసఁగు పెందొడసేవ కియ్యకొంటి

గీ. వనిత ! నేరమటంటి నీవాఁడనంటి
యువిద ! నీయింటిపంచ నిట్లొంటినుంటి
తలుపు తీయకయుంటివే చలముఁగంటి
వేల ? ననవింటిదొరకేళి వాలుగంటి!.

శా. ఆరీతి న్మదనాతిరేకమున దైత్యారాతి పల్కంగ ల
క్ష్మీరామామణితల్పు వేదిగిచి, సామీ! మన్మనోగామి! యి
య్యారే! నేరము లేమి?మీకుమమునిట్లాయాస మొందించుమా
నేరంబుల్ క్షమియించుమంచుతమిఁ జెందెన్ జేనివామాంకమున్.

సీ. కడువేడుక విరించిఁ గన్నసామి హసించి
కలిమి ముద్దులగుమ్మఁ గౌఁగలించి
మెఱుపుతోఁ బెనగొన్న మేఘంబువలె మించి
వివిధభక్తులఁ గృపావృష్టి ముంచి
భాసురాంబరమైన పాన్పుపైఁ బవళించి
పణఁతి చన్గుండెలఁ బ్రాపుఁగాంచి
విడువడి ముత్తెంపు వడగళ్లు వెదలించి
పులకాంకురంబు లింపుగఁ గదించి

గీ. స్తనితనాదంబు లులకించి సంభ్రమించి
తరుణిఁ గరఁగించి యానందసరసిలోనఁ
జెల్లువఁ దేలించి, ఘనలీలచే నటించి
జగముఁ బాలించెఁ బరితృప్తి సంతసించె.

శా. భూతేశాదికృతస్తుతీ! జితమరుద్భూమీంద్ర ధైర్యోన్నతీ!
శాతాస్త్రౌతతవాతధూతరిపురాడ్జాతాసువార్మిక్షతీ!
నీతిభ్రాతిమతిస్థితీ త్రిజగతీ నృత్యద్విదీర్ణారతీ!
చేతోజాత శతాకృతీ! రఘుపతీ! సీతాపతీ! హృత్పతీ!

క. సరసదయాపరభీకర
కరహత వరహరశరాస ఘనశుల్కప్రా
ప్తరమావర! వరమస్కరి
తరుణీ జీవాతునిజపదరజోవిలాసా.

## కవిరాజ విరాజితము.

హతఖరదూషణ!యాశ్రితపోషణ!యంచితభూషణ!సర్వకళా
న్వితమృదుభాషణ! నీరధిశోషణ! విస్తృతభీషణ బాణగణా
నతసురతోషణ! నమ్రవిభీషణ! నాగవిభూషణ చాపహతీ!
స్థితిజయఘోషణ! కల్మషభీషణ దీప్తజతేషణ! దాశరథీ.

క. నెమ్మని నేనును నీ నా
మమ్మ మనమ్మనను నాని మానమునను నీ
మమ్మన నే నున్నానని
నమ్మము నను నీమనమ్మ నను నోమేనా!

## మాలినీవృత్తము.

జయతు జయతురామా! జానకీచిత్తరామా!
విముఖపరశురామా! విశ్వజాలాభిరామా!
సమరసగదరామా! (స్వైరిహృద్యాభిరామా!)
ప్రముదితమునికామా! రామతీర్థాద్రిధామా!

క. హరి లక్ష్మీసంవాదము
మరి గోగులపాటికూర్మ మంత్రిరచించెన్
ధర నాదుర్తి కులజుఁడగు
హరిహరదాసుఁడు లిఖంచె నానందమునన్.

## గద్య

ఇతి శ్రీమన్నారాయణ చరణదాస్య పవిత్ర, గోగుల
పాటి బుచ్చియామాత్య పుత్త్రి, శ్రీమత్తిరుమల
పెద్దింటి సంపత్కుమార శ్రీవేంకటాచార్య దేశి
కానుగ్రహసనాథ, శ్రీకూర్మనాథ ప్రణీతంబైన
శ్రీలక్ష్మీనారాయణ సంవాద మహా
ప్రబంధంబు నందుఁ బ్రథమాశ్వాసము
సంపూర్ణము.

# శ్రీలక్ష్మీనారాయణ సంవాదము



## ద్వితీయాశ్వాసము.

క. శ్రీజానకీ కుచశ్రీ
భ్రాజిత శ్రీరామతీర్థ పర్వతధామా !
తేజోజితోష్ణధామా !
రాజితసుగుణాభిరామ! రాఘవరామా!

కం. ఈరీతి వేడ్క లక్ష్మీ
నారాయణు లఖిలలోకనాటకలీలా
పారీణులై చెలంగుచు
ధారుణి భక్తప్రసన్నతాగతి నుండన్.

భుజంగప్రయాతము.

వసంతర్తు వత్యంత వల్యంత సంతా
న సద్భృంగ సంగీతనాదద్రవ ద్భ్రా
జ సంస్పృష్టమారంద జాలాంచితారా
మసౌరభ్యయుగ్దిక్కమంబై చెలంగెన్.

సీ. భామినీ మానముల్ పండుటాకులు డుల్లె
పల్లవరాగంబు లుల్లసిల్లె
విరహిణీబాష్పంబు విరిదేనె విలసిల్లె
సరసాళి వనకేళి సంఘటిల్లె
మరునిపంతముఁ జూచి పరువు మిక్కిలి చెల్లె
గుణవత్తరుల లతకూన లల్లె
వలిగాడ్పు విప్రలబ్ధలయూర్పు వర్తిల్లె
వినయుక్తి పద్మిని యింపు సెల్లెఁ

గీ. గటకమణిగణఝుణఝుణకలితచరిత
మదవతీపదతాడనమహితలసద
శోకసుమ మధుమధునాభిషేక విభవ
భాసురంబైన వాసంతవాసరంబు.

కం. ఏమని వర్ణించెద న
య్యామని యువ యువతికేళికాముక విలస
త్కామశరవర్షకరసా
దామిని......రాజ్యవృత్తిఁ దామసి యలరెన్.

వ. అప్పుడు.

సీ. మోముదామర నేత్రమునకు వచ్చిన సూర్య
బింబమువలెఁ గిరీటంబు వెలుఁగ
నబ్ధిలో సహజన్ములౌట ముఖేందుమం
డల యుక్తి మకరకుండలము లలరఁ

మనసులోఁ బొడమిన ఘనకౌస్తుభాభ్రాంతి
కరవల్లు లన హారగణము గులుక
జిగికరశాఖలఁ జివురుజొంపములనఁ
గెంపుదళ్కుల భుజకీర్తు లమర
గీ. కలితకంకణ మేఖలాకటకఘటిత
కనకనవరత్న నవరుచికాయ, జలద
విద్యుదావృద్ధనుఃకళావిభ్రమముగ
నాత్మసతి కిట్టు లనియెఁ బీతాంబరుండు.

కం. తోటలు సిగిర్చి పూసె
న్వేఁటకు వేంచేయు మనుచు వేఁడగ భక్తుల్
మాటికి మాటికి వేడిన
పాటలఁ బాటలతరోష్ఠి! పయనంబైతిన్.

ఉ. ఓ ననబోఁడి! యో జలరుహోపమితానన! యోలతాంగి! లా
క్ష్మీనలినాక్షి! నిన్నొక నిమేషము బాసినఁ దాళఁజాల భ
క్తానుగుణంబుగా వనవిహారము మానఁగనోప నింక నా
మానస మిందునందునగుమక్కువ లుయ్యెలలూఁగుచుండెడిన్.

కం. అటు తెరుట నిలిచి రాధా
విటు నొంటిని నుదుటఁ జమట విటతటముగఁ గా
గిట గిట వణకఁగ నిందిర
దటుకున నడ్డంబవచ్చి ధవు నిటు వల్కెన్.

సీ. ప్రాణేశ ! ని న్నెడఁబాసి యొార్వఁగఁజాల
నోర్చిన ప్రాణంబు లుండు నేమి ?
యుండినఁ ద్రుటికాల మొక కల్పమై చను
జని నిను మరలఁ గన్గొనఁగనోపఁ
గనుగొన్న నీదురాగ్రహము నిల్పఁగలేను
నిల్పుకున్నను నిన్ను నిందసేతు
నిందించ నపచార మొందకయుందునె?
యింతకన్నను వేఁడుకేమి సామి!

గీ. యేటి కీయెగ్గు సాలదె ? నాటి కెగ్గు
దాకటికతనమునను నిరాకరించి
రాకుమనియెద వంతఁ జిరాకు యగును
గాక ! రాకానిశాకరాకారవదన !
బోక నీతోన యేనైన రాకమాన !

వ. అనిన నప్పరమపురుషుం డప్పడఁతి కిట్లనియె.

సీ. నవపుండరీకాళి నాదంబు గాదిది
నవపుండరీకాళినాద మబల !
నానాభవనశిఖినటనంబు గాదిది
నానాభవనశిఖినటన చెలియ !

## ద్వితీయాశ్వాసము.

ధరఁ జెలంగు నతనుహారిరోద గాదిది
ధరఁ జెలంగు నతనుహారిరోద సతి!
శరభాసమాన విస్ఫురణంబు గాదిది
శరభాసమాన విస్ఫురణ తరుణి!

తే. కేకిసుమగృహావనజల కేళులందుఁ
గాన వాగ్భయమానసంగతుల మించి
యభినవశిరీషసుకుమారి వైన నీకు
ఘోరమృగములు వన్యావిహారమునకు.

కం. హరి యిటు లిందిరఁ బలికినఁ
గరములు జోడించి యనియె ఘనతర తేజో
వరధృతి మీా వెంబడి నే
నరుదెంచిన నేమిసేయు హరులున్ గిరులున్.

ఆ.వె. పరి హరించఁదలఁచి ప్రతిహారివ వన్నిన
వెఱతుఁగాక లోకవిభుఁడ వైన
నీకుపాదసేవ నిష్ట గల్గిననేమి?
భయము మిన్నుమన్ను పయిని బడిన.

చ. పడఁతుక యిట్టులన్న విని పన్నగతల్పుఁడు చిన్ననవ్వుక
న్గడలఁ గృపారసామృతము కాలువలై దిగినట్లు చెక్కులన్
గడలుకొనంగ నంగనను గౌఁగిటఁ జేర్చుచు నింతి యింతగా
నడలఁగనేల? రమ్మని ప్రియమ్మునఁ గ్రమ్మరఁ గొమ్మ కిట్లనెన్.

మ. మొదల న్నేను నిజాయుధాంశకలనన్ బుట్టించితిన్ గౌతుకం
బొదవన్ ద్రావిడభూమి నిశ్చలతపోయోగాత్ములన్ శాంతస
త్యదయాశీలుర చిత్తశాల్యు భయవేదాంతార్థసంబోధమ
త్పదపంకేరుహనిత్యభక్తిపరులన్ పన్నిద్ద రాళ్వారులన్.

తే. అందు శార్ఙ్గాంశమునఁ బుట్టి యతిదయాళు
వైన తిరుమంగయాళ్వారు లలరె ధరణి
కోరి యతనికి సతియయ్యెఁ గుముదవల్లి
యనెడు వనితామతల్లి భాకనకవల్లి.

కం. కులసతి యనుకూలత్వం
బలరఁగ నాపుణ్యమూర్తి యాసేతుహిమా
చలమధ్య వైష్ణవులకున్
గల ధనమంతయు నొసంగె ఘనతరభక్తిన్.

సీ. ఇంటిలోనున్న సొమ్ముల్ల చెల్లిన వైష్ణ
వారాధనాపేక్ష నాఘనుండు
నీలికాసె బిగించి డాలుకత్తి ధరించి
కేలవిల్లమ్ములు లీలదాల్చి
దొంగబంట్లకునెల్ల దొర యయ్యె భేరికా
భూరికాహళములు భోరుకొనఁగఁ
ద్రోవలలోఁ గాచి దొరల సంపన్నులఁ
దెఱవాటుగొని కొట్టితెచ్చినట్టి

## ద్వితీయాశ్వాసము.

తే. నవధనంబు సహస్రవైష్ణవుల కనుది
నంబు సంతర్పణముసేయు నాపదాబ్జ
భక్తియేమర కీకీతి బహుగిరీంద్ర
వనములందునఁ దిరుగు నో వనజగంధి !

కం. ఆతనిఁ గనుఁగొనుటకు నే
నీతీరున వేఁటకనుచు నేగెద నీవున్
నాతో రమ్మా ! కొమ్మా !
చేతోజాతాంశుగమ్మ ! శీఘ్రము లెమ్మా !

వ. అనిన లక్ష్మీదేవి యత్యంతసంతోషస్వాంతంబున,

సీ. జవ్వాదిచేఁ గురుల్ దువ్వి ! కొమ్ముడిదీర్చి
పసిఁడిగేదఁగి రేకు లొసఁగఁ గూర్చి
సురుచిరమణికృత సూర్యచంద్రుల నిల్పి
మేలు డాల్బిందులు డీలుగొల్పి
సొగసుపాపిటఁ జేరుచుక్క చక్కఁగ నుంచి
నెరయొంచకమ్మి ముక్కెర ధరించి
కుచ్చుల బాపలీల్ గుమ్మటీల్ వెలలేని
పోజులు కమ్మలు (భావిరలును)

తే. పసిఁడికుచ్చులతాయితుల్ పచ్చరాల
కడియములు గాజులోడుఁ జౌకట్లు నుంగ
రములు తాళీలు చంద్రహారములు దాల్చి
యందియలు మువ్వ లలరించె నవ్వెలంది.

సీ. ముదితకుఁ జేర్చుక్క ముత్తియంబుల వడ
గళ్లు రాజిల్లెను కచఘనము
దద్భువనంబు వెల్వడివచ్చె నా యొప్పె
నాచంద్రకళయయ్యె ననఁగఁ దనరె
మొనసి చెందామర మొగ్గలా మొగ్గల
కాకరమగు హృత్సరోంతరమున
ముననూలుకొనెనన ననుఁగులై మరుకాల్వ
యాకాల్వదరిని యేదనఁగ నాభి
తే. బావి యాబావి చెంతఁ గన్పట్టు జఘన
వేది యావేదికడ కళల్ వెలయునూరు
రంభ లా రంభలందుంచి ప్రభలు పిక్క
పొదుల మఱి తమ్మి ముల్కులై పదము లలరె.

క. ఇందిర యపుడా యభినవ
సౌందర్యముఁ జెంది యలర శౌరి, యమందా
నందంబునఁ గౌఁగిట నిడి
సందడిగా జనము వెంటఁ జనఁ దివురుటయున్.

సీ. ఊర్ధ్వప్రసారితాత్యున్నత హస్తంబు
రవి పైకినెగసెడి రహుతసంగ
శ్రవణోర్జితాళులా శాఖల జారి చా
టలఁ జిమ్మగతివచ్చు శిలలఁ బోల

లంబృంహిత స్తనితములనాడెను కేకి
రావము కాహళిరవముఁ గలియఁ
గుంకుమపటగుప్త కుంభముల్ సామికిఁ
గులకాంత చనుఁగట్లు తలఁపుసేయ
తే. సవితృమండలముదయాద్రి సహితమగుచు
నచ్యుతుఁడు జెందవచ్చెనో యనఁగఁ గెంపు
డాలుగల కుందనంపు చౌడోలినలరెఁ
గరివరము నెక్కి హరి కరివరదుఁడగుట

ఉ. అప్పుడ కల్మికొమ్మ పతియానతిఁ గైకొని నైజయానముల్
తప్పులు బట్టకంచు వసుధాస్థలి సాగిరి క్రొమ్ముక్కులై కరుల్
చొప్పడ నమ్రవింధ్యగిరి చొప్పునమ్రగ్గెడు దంతి నొక్కచో
గుప్పునఁ గేలనందుకొనె గోరు లురోజముసోఁక శౌరియున్.

చ. ఉరువడి లోహనాళధరులుజ్జ్వలులౌ విలుకాండ్రుకొంతయు
క్కరులు గురాలు పౌజు బలు కత్తలసాధకులెల్లఁ గొల్వఁగా
గురుజయ భేరికాపటహకుంభితకాహళ ముఖ్యనాదవై
ఖరులు జెలంగఁ గేతుగజ కాండముతోఁజనె శౌరి వేఁటకున్.

శా. వెన్నుం డాగతి వేఁటకేగి వనిలోవింతల్ రమాకాంతకున్
జెన్నొందఁ గనుపించుచుండ రవి మించెన్ మింటఁ బేరండచే
మన్నున్మిన్నుఁదపింపనయ్యె బెడఁగైమధ్యాహ్నమాహా! తరుల్
తన్నున్మాలిన ధర్మమే మనుగతిందాల్చెన్ బయల్నీడలున్.

తే.గీ. అప్పుడు తిరుమంగయాళ్వారియందుఁ గరుణ
స్వామి కృపుచేతఁ దాఁదో షాసంగఁ దలఁచి
యెచట ధనమబ్బకుండఁగా నిచ్చఁజేయ
వంతఁ జింతించె నిట్టుల వైష్ణవుండు.

సీ. యంగాత సిరికరాళంగ శ్రీవైష్ణవా
ళొన్ను మిన్నొప్పె నానెన్న శెయ్య
యత్తన వాళ్ పశోదిరి కివాళ్ తిగు
తొన్ను మిల్లొప్పె నానెన్న శెయ్య
ధనవంత నిప్పొవత్తువరిల్లై (వ) యిల్లై
పున్నె మిల్లొప్పె నానెన్న శెయ్య
రెండు శానూచవారి రంగసాము పాళి
కొన్నమల్లొప్పె నానెన్న శెయ్య

తే.గీ. యనుచుఁ జింతించెఁ దిరుమంగయాళవారు
వైష్ణవార్చనదన కిటువాంఛ చేసి
రహహ! యెవ్వరుఁ ద్రోవఁ రారయిరటంచు
నొక్కపొడుగు మహీరుహం బెక్కి సూచె.

సీ. ప్రకటహాటకరత్నమకుట హారాంగద
కటకాదిచాకచక్యముల వాని
మించును రుచిమించు మేఘుంబు డంబున
మించుఁబోణిని దరినుంచువాని

తేటలఁ బాటలఁ బాటలగంధుల
యాటలఁ బాటల నలరువాని
మంగళోపాంగ మృదంగ సంగతిఁ దాళ
భంగికి వేడ్కఁ జెలంగువాని

తే.గీ. సామిఁగనిఁ బెండ్లికొడుకని జనమొసంగ
ధనముగలిగెను వైష్ణవతతి కొసంగ
ననుచు భటులలరంగ సాహసమొసంగ
వచ్చె నమ్మేటి దొంగ భావంబు పొంగ.

తే.గీ. సిల్లకోలలు బలువిల్లు చేవదుప్లు
కత్తిరలు వంకకన్నపుకత్తి బద్ద
యచ్చుపడ నీలకొట్టుచు మచ్చుజల్లి
చెల్లదోచిరి దొంగ లా సేన నెల్ల.

క. మ్రొక్కుచు నక్కుచు నిక్కుచు
దక్కుచు పోలుమచు సామిదరి నటనంబుల్
ద్రొక్కుచుఁ దిరుమంగాళ్వా
రక్కట ! తన యోగ విద్య లన్నియుఁ జూపెన్.

సీ. అడియే ణ్ణనుచుఁబట్టె గొడు గెంకవైచెను
వింజామర హరించె విసరెద నని
చరణంబులొత్తి నూపురములు దొంగిలెఁ
గానుచే నిమిరి బల్ కాంచి గొనియె

శీల గూర్చెదనని తాళీలు వదలించె
నమరింతునని కుండలములు తీసె
నంగుళీయక కంకణాదిక మూడఁ బ
ట్టెను జేతులును జబ్బెలును గొనెను జం

తే.గీ. తురగతిని విభ్రమమునఁ దస్కరనటుండు
మకుట కేతు పటాయుధనికర బిరుదు
జాలముల వెలలేని యాసామి సొమ్ము
లన్నియునుదోచెఁ గైంకర్య మచ్చుపడఁగ.

వ. ఇట్లు పరిహరించిన నెఱింగియు నెఱుంగనట్టి భక్తవత్సలులైన లక్ష్మీనారాయణులుం దల్లిదండ్రులు దనయునివలె, దయారసారకటాక్షప్రసాదంబుల సూచుచు నూరకున్న నప్పాట చ్చరవరుండు నప్పంకజాక్షుల సకలాలంకారంబు లంకించు కొని శంకించక జరిగినప్పుడు, వెఱచిన భటులును, పఱచిన నటులును, దాఁగిన గాయకులును, విరిగిన దండనాయకులును, బెదరిన తాళంబులవారును, చెదరిన మేళంబులవారును, మఱియు నూహితామంత్రులగు మంత్రులును, నత్యంత ఖిన్నులగు సంపన్నులును, నానాజ్ఞానవంతులగు సామంతులును గలసి, సైన్యంబు దైన్యంబునొందె. కుకవి కావ్యంబునుబోలె నస్త్రపాలికలితంబై, నైమిశంబునుబోలె బహు ధాన్యాక్రాంతమై, కాసారంబునుబోలెఁ గుముదా

కరంబైన నంతఁ గొందఱు దొంగలు దొంగ లనువారును, దోచె దోచె ననువారును, నేవళంబునఁ బోయినవారును, మఱియుఁ గొందరు భ్రమసి, తమవారింబట్టుకొని వీరె దొంగలని పెనంగి, కొంతతడవునకుఁ దెలసి, డిల్లవోవువారును, కొందఱు శూరులాయుధమాత్రావశిష్టులై యింక నేమి! సామిం జూచెదమని లజ్జించువారును, గొంద రుత్సవాది వృత్తాగతులైన బ్రాహ్మణులును, మత్పితామహాసంపాదితంబైన పట్టాభరంబు చనియె. దానికేమి? మన్మాతామహదత్తంబైన ద్విముఖస్థూలకలశంబు బోయె. అందుకేమి? సదర్భగ్రంధియుంగరంబు మత్పితృతుల్యంబుగాఁ జూచుకొందు నదియు నందించుకొనిపోయిరి. ప్రాడ్వివాకుల్లాచోరుల సవాళ్లంబట్టి తెప్పించి కట్టించికొట్టించి మాపదార్థంబు రక్షించునందాక ఈరాజువద్ద నభోజ్యంబుండువాణ్ణని అగాయిత్యులై యుండిరి. కొందఱువైశ్యులు సర్వసామ్ముపోయిన గుండెలు చెదరి, పెదవులఁదడుపుచు, ఇఁకనేమి బేరంబు? సంసారంబు బాగాయెఁ జిల్లరసంచి అయ్యలగారికి నిరుడే ముడిపెట్టనైతి యింక నెక్కడ దిక్కుకలుగునని కనుపడువారికెల్ల మ్రొక్కుచుండి రప్పుడు, సకలకలాపుండును నొక్క పరిహాసకుండు చోరదత్తంబగు కౌపీనంబుతో వచ్చి విప్రవైశ్యాదులఁ దత్తస్కంధంబులఁగేలిసేయుచు సామికి మ్రొక్కి మీదయ మామీఁద నిట్లుండె ఎవ్వారియందు

ననుగ్రహంబు వచ్చు వారివిత్తంబు హరింతునన్న మీప్ర
తిజ్ఞ చెల్లించుకొంటిరి. మాభాగు ధోవతులుంబోమె దొం
గల పొడగనక యుంటిమి యనిన మంచిదట్లపొడఁగనిమెదు
ఝుడియక నిలుమని యాలీలా వినోది మహాబలులు,
నానా నూనంబగు నుద్యానవనంబు మణిమ్లేచ్ఛాపహృత
భూషణ సంతానంబగు స్వకేనంబు గని తాదోపు వడితి
నని లోకులకుఁదోఁచె ననియును, భక్తుని ప్రతిజ్ఞ చెల్లిం
చితిననియును నయ్యేకాగాయకు లెవ్వారెనియును, లజ్జా
హర్ష వాత్సల్యంబులై యుల్లంబులు మల్లడిగొన మానుష
వేషంబునఁ బరిచర్యసేయుచు ననంతగరుడ విష్వక్సేనాళ్వా
రుల్గఁ జూచి, యస్మదీయ ధనాపహర్తయగు దొంగను గట్టి
తెమ్మని యాజ్ఞాపించిన.

ఉ. ఆయడువారు దేవర! యిటానతి నిచ్చినఁ గొండ పిండిగాఁ
జేయుదుమంచుఁ బంతమున శీఘ్రగతింజని పెళ్ళుగా నిఘా
జేయుచు రాజులాగు విలసిల్లెడు దొంగను బట్టి రార! చో
రా! యిఁకమమ్ముఁదోఁచినఁ బదార్థముఁగొంచుమదీశుచెంతకున్.

మ. అనిఁ దస్కరనాయకుండు హరిభక్త్యాసాద్య సందర్శనం
బున విజ్ఞానముఁజెంది శాంతవచనంబుల్ బల్కనేవత్తు మీ
ధన సంభారముతోడ మీప్రభువుచెంత న్గూర్పుఁడీయంచు వ
చ్చినవారిం బిలకించి, యాజ్ఞగతి లక్ష్మీవల్లభుం డిట్లనెన్.

ఉ. ఎవ్వఁడ వీవు నీయునికియెక్కడ? నీకులమేమి ? తండ్రి నీ
కెవ్వఁడు? నామమెద్ది ? హరియించితివేటికి మత్ప్రవార్థముల్
క్రొవ్వున నిట్టిశౌర్యమునకున్ ఘనశక్తి యిదెట్లుగల్గెరా
రవ్వనుబొందకే తెలుపురా! యపరాధ పరాత్మ! తస్కరా.

క. వశుఁడవయి నిక్కమంతయు
విశదముగాఁ దెల్పురోరి! వెరువకు నిన్నున్
దశరథతనయాకృతి మును
కుశలవులం బోలెఁ బ్రోతుఁ గోపము సేయన్.

సీ. అయ్య! తిరుమంగాళువను పేరుగలవాఁడఁ
హరి పాదజాతుఁడ నైనవాఁడఁ
బ్రబలవైష్ణవచయప్రబల దేశమువాఁడ
ప్రబలభాగవతాంఘ్రి భక్తివాఁడఁ
నచ్యుతాలయ దర్శనానంద మతివాఁడఁ
గలిదోషములు మదిఁ గలుగువాఁడ
భగవదాజ్ఞాగతి ప్రాభవోన్నతివాఁడ
యమునకైనను లొంగనట్టి వాఁడ

తే.గీ. మీరు పిలచితిరని వించు మేలటంచు
సరస నిలిచితి సెలవిమ్ము సంశయమ్ము
వలదు పనివిందు బుధసేవ వదలకుందు
నప్పుగా దిది సతతంబు నామతంబు.

క. క్షితి భవదార్జిత విత్తము
కుతుకమునం జెంది పెండ్లికొడుకుం బలె భూ
పతిదండన మెఱుఁగని ఘన
ధృతి ! రా జెవ్వాఁడు నీకుఁ దెలుపుము చోరా !

ఉ. పంచశరున్ హరించగలపాటి విలాసము మందహాసమున్
గాంచనవాసమున్ మొదలుగాఁగలమంగళ విష్ణుచిహ్నముల్
గాంచి గురుత్వముంచితినిగాని భయంపడిగాదు నన్ దటా
యించకు రాజునాకు జగదీశ్వరుఁడౌ హరిగాక యన్యుఁడే.

ఉ. మంచివిచారమూనితివిమార్గములోపలఁ జిమ్మచీఁకటుల్
ముంచినయట్టి నట్టడవి లోపల నెత్తులు గొట్టి దారపు
త్రాంచితులైనసాధుల గృహస్థులదోచుమటంచునిన్ను బో
ధించినయాప్తు లెవ్వరొకో? దెల్పుముతస్కరవంశనాయకా!

గీ. ఆప్తులెవ్వారు తె రన్యులైనవారు
వేదమార్గప్రతిష్ఠాప నాదిగురువు
లుభయవేదాంతరసికులై యున్నవారు
వైష్ణవులెమాకుఁ దగునాప్తవర్యులయ్య !

ఉ. ధర్మపదంబుదప్పి బహుధావిధమాయలు పన్ని యిట్టిదు
ష్కర్మముచేత దొంగిలిన సంపదనీవు భుజించువాఁడవో
యర్మిలినీదు రాజునకు నర్పణసేసెదనీకు మిత్రులై
కూర్మివహించువైష్ణవులకున్ సమకూర్చెదొ తెల్పుతస్కరా!

సీ. రాజెట్టివాఁడైనఁ బ్రజ లట్టివారౌట
వినవా ? నాయేలిక వెన్నదొంగ !
నెలయుఁ దద్దాసుల విష్ణుపదంబెల్ల
కొంకక కొల్లలు గొన్నవారు
వారిమార్గము మాని వేరె మార్గము బూన
వారికన్నను దొడ్డవాఁడ నేను
ధర్మశాస్త్రపదంబు దప్పివర్తించెద
ననుచును బలుమారు నడిగెదీవు

తే. గీ. ధర్మశాస్త్రముదేమొ ? యాతత్వమేమొ ?
మొదలెఱుఁగ నక్కటా ! నాదు మూఢభక్తి
నేగణించిన యర్థమ్ము నిజము నమ్ము
వైష్ణవులసొమ్ము నాకిది వ్రతముసుమ్ము.

ఉ. వాసిగఁ బల్కితీవు వశివాఁడవులే తెరవాట్లు గొట్టుటల్
దోసమటంచుఁ దోఁచ కిటు దోఁచకమానవు మానవు న్మహా
యాసమువొంద దొంగలు నిజార్థముదోతురుగాని దానముల్
జేసెదరంచుఁ దోఁచదిది చిత్రమునీయెడఁ జోరరాయుఁడా !

గీ. ప్రభలఁ దులసులల నూర్థ్వపుండ్రములఁ గాంచి
పంచసంస్కారవతులైన భాగవతుల
కించిదర్థంబు (దొంగిలి మైన నిడఁగ?)
మంచితీర్థంబుగొన నిది మద్వ్రతంబు.

చ. న్యాయసమార్జితంబయిన యర్థమునన్ బుధసేవసేయుచోఁ
బాయుసమస్తదోషములు బాధిల సాధుల దోఁచిపెట్టు య
న్యాయధనంబుచే సుకృతమబ్బునె? నారదమౌని, దేవదై
తేయులఁ బోరుపట్టు పగిదిన్ జెడచెప్పిరి నీకు వైష్ణవుల్.

మ. బలవద్రత్నప్రాప్తము రాజ్యమన్న పగిదిన్ బల్మారు నే బీదసా
ధులదోఁచన్ధనవంతులై బహుమదాంధత్వంబునంగ్రొవ్వు ధూ
ర్తులసొమ్ముల్ల హరించి వైష్ణవుల కిత్తున్ మాధవప్రీతిగా
నిలనీకార్యముధర్మమౌనె?యయినన్ హృద్యంబునాయాత్మకున్.

సీ. కాకులఁబడఁగొట్టి గరుడపక్షులఁబ్రోచు
కరణి నీధర్మంబు గానఁబడియె
మ్మార్గస్థులనుదోఁచి మఱివైష్ణవుల కిచ్చు
మతమదినాకు సమ్మతముగాదు
అజ్ఞానమనరాదు హరిని నుతించితి
హరిప్రబంధంబు లాచరించి
యోగమోక్షవ్రత యజ్ఞాదులొనరించి
యాతఁడువలె మోదమందె దీవు

తే. గీ. నీ విటులనొనర్చిన సొమ్మినిందబూను
నమ్మనగుబాటు దొంగతనమ్ము మాను
నెనరు మదినేను నీతోను నిక్కమేను
చేరి యన్యులవలెఁ జెప్పఁ జేరరాను.

మ. ననునీవున్ వెఱపించరాకు నలువన్ నన్గట్టి బ్రహ్మాండనా
ధుని పాదాంబుజదాసవర్యులనుగూర్చున్ దోఁచుసొమ్మెల్లవ
మ్మను పాపమ్ములుసోకవట్లగుటచే నే నీ దివాణమ్మునన్
దీనార్థమ్మున కెంత చెప్పినను ఛాదీ యెక్కు-నా? యెక్కడన్.

మ. ఔనౌ! మేల్భళి! బాగు! మంచిదగుశిష్టాచారముల్ నేర్చినాఁ
డవు లే యింతరహస్యధర్మగతి కట్టా! నీగురుల్ దెల్పిరో
భవదీయాన్వయసాంప్రదాయమునఁబ్రాప్తంబయ్యెనో నీదుబు
ద్ధివిశేషంబునఁ దోఁచెనో ఘనకళాధీశాలివీవేకదా!

తే.గీ. చెట్టు మొదలునఁ బోసినయట్టినీరు
ఫలమొసంగినగతి విష్ణుభక్తుల కిడు
సొమ్ము ద్రోహార్జితమ్మైన శుచికరమ్ము
శాస్త్రదూష్యమ్ముగాదు నిశ్చయము నమ్ము.

చ. తులువలుఁబాపముల్ సలుపఁగొల్త శుభంబులెసంగి పొంగిన
ట్లలరుచునుండు నంతటఁ దదన్వయమేఁచఁడు నొక్కసారె వా
క్కలితములై నయట్టిశనగల్ గొని మృష్టటి నాని గొప్పలై
పగిలినఁ గుండవిచ్చుఁగద! పక్కనఁ గామముశౌర్యమేటికిన్.

సీ. శనగలు నాని యుబ్బిన మృష్టటి నశించు
నష్టమేమగు? లోహానవ్యఘటము
భాగవతార్పణపరు లల్లై వడిఁబోరు
వినవయ్య! యిట్ల నామనసు కుదిరి

తానుచేసినపని తప్పైన నొప్పైన
కాదనువారును గలరె ? జగతి
నీయుపదేశంబు నీకు బాగుగఁ దోఁచు
నాబుద్ధి నెవవని నాకుఁ దోఁచు

తే.గీ. అజ్ఞునకుఁ దెల్పఁగావచ్చుఁ బ్రాజ్ఞుఁడయ్యుఁ
దెలియనట్టున్నఁదరమౌనె పలుకు లేల?
మొదల ముసి ప్రుచ్చలించు నా నుదుటియందు
భగవదాజ్ఞాక్రమంబున బ్రహ్మ వ్రాసె.

కం. ముని ముచ్చాపరు దోఁచిన
ధన మెచ్చటఁ జేతురోయి? దానము మైకా
ఘనవచ్చు పెద్దలెవ్వరు ?
నీను మెచ్చరు మాను శౌర్యనియమం బింకన్.

కం. ఘనశౌర్యార్జితమై తగు
ధనమె సదాకొనుచు విష్ణుదాసుల కిత్తున్
విను నీకే నటుజెప్పెము
తనువైన న్విడుతు దొంగతనము న్మానన్.

మ. ప్రకటస్థావరజంగమాత్మకధర బ్రహ్మేంద్రలోకాదియు
న్సకలారూఢము లెల్లఁగుక్షినిడి మోసర్వేశ! మాయల్ మరం
దకళాపూర్తి యొనర్చవే పటసముద్రంబుల్ తదీశా! మన
స్సు కడన్నిల్పినభక్తవర్యుఁడగు మాసామిన్నన నిమ్మా! యిఁకన్.

శా. మాయామోహితలోకజాలుఁడవుగా? మాసామి! తెల్లంబుగా
నోయీ! దొంగలకెల్ల నేగురువునై యున్నాను నీబూటకాల్
సేయన్ నీదగుబోధగాదు విను బల్ విత్తంబు నీకిచ్చి యే
బాయన్ వైష్ణవపూజసేతు నది యాసల్ మానుమీయిక్కడన్

ఉ. దస్యుకులావతంస ! వినుధార్మికబుద్ధిని విష్ణుభక్తిసా
రుస్యమెఱుంగువాఁడ వది యిట్టిటునన్వలెఁ గట్టనేల ? వి
శ్వాస్యము నాదువాక్యమిఁక శౌర్యము మానుముగోల, మాసరో
జస్యకు మాకు భూషణములన్నియొసంగుము మేలునీకగున్.

సీ. చాలుచాలిట్టిబాసల్ వలదాడఁగాఁ
దోఁచునే ? దయగల దొంగవాఁడు
వైష్ణవుల్ వేలున్నవారి తిరుమాళిఘల్
వారికి దాస్యముల్ కోరిసల్ప
వలెఁ బిరుమాళ్లిరువడి ఘళిసాక్షి యి
క్కడను మాట విను భాగవతపాద
జలజకైంకర్యముల్ శౌర్యముల్ మానుము
జన్మవ్రతంబులె న్నసుము నీకు

తే.గీ. బలిమిగలిగిన కలహించి గెలచి మాకుఁ
గల ధనంబెల్లఁ గైకొన వలసితేను
బలుబలుకులేల ? యెదుటనే నిలచియుంటి
బలములో నెంచి పోట్లాడ బలము బంపు.

వ. అని యిట్లు చోరవర్యుండు దద్దరిల్లక స్వామితో వాక్యోప
వాక్యంబు లాడుచు వైష్ణవభక్తివదలకున్నఁ గృపాళుండై
యాక్షణమ్మున,

సీ. అలరు తామరులకుఁ జెలి వెంతగలిగించు
దొలగించఁగలుగు కందోయితోడ
మబ్బుపై మెఱుపుగ మరుచిన్నిసిరికన్నె
నెరవన్నెఁ దగురొమ్ము నీటుతోడ
వరకీర్తిధామముల్ వలివెల్గుకళ గల్గు
బలుపుల్గురా తేజి చెలువుతోడ
గురుభూషణశుభాంగసురశాఖివరశాలి
కరశాఖిచేఁ జతుష్కంబుతోడ

తే. నీటిబంగరుపట్టు వల్వెటుతోడ
విమలవనమాలికాకౌస్తుభములతోడ
శంఖచక్రాదిసాధన చేయితోడ
నహహా ! ప్రత్యక్షమయ్యె నారాయణుండు.

కం. అటు యెదుట నిలచి ప్రస్ఫుట
ఘటనాపటునటనుఁడైన ఘనుఁడు వరంబా
దట వేడుమనినఁ బదతట
మటనిటలము సోఁకి మ్రొక్కి యాశ్వా రనియెన్.

సీ. ఆస మద్విజయవిజ్ఞానముద్రిత హృద్వి
తాన మృత్యుంధాన! తే నమోస్తు
దీనకారుణ్యానదీన కిమన్య వృ
తేనధామజితేన తే నమోస్తు
మేనమోహిత దైత్యసేనమోదితభక్త
దీనమోహిత పావ తే నమోస్తు
మానసస్థుల మాని మానసస్తుతసామ
గానవస్తుప్రియా! తే నమోస్తు

తే.క. దీనదానవిధానాయ తే నమోస్తు
దానపాలనలీలాయ తే నమోస్తు
దానపాలనశీలాయ తే నమోస్తు
మానిలయకృష్ణ! విష్ణవ తే నమోస్తు.

*మ. ఖగరూపాంచితకామతాంగికిటి ముఖ్యాకీలితో దారపున్
మృగరాజాకృతికుబ్జమూర్తి దరకూర్మీభూతవిప్రాకే
లిగతోర్వీసుతకైరవాప్తరుచిశాలీకోణ (పతీ) వ్రత
ఘ్నగతాకౌతుకవాజిధావనవరా! కంసారివర్యాదరా!

*కం. రామా రారా మఱిమఱి
మామా మెర మామ మామ మామా మారీ!
రామమరామా మిమ్మే
మ రమారామరామరారామేరా.

* ఈరెండుపద్యములు మాతృకలో నిట్లె గన్పట్టుచున్నవి.

తే.గీ. దేవ! తిర్యఙ్మనుష్యాది జీవకోటి
కాలకర్మాదిగుణములఁ గట్టిరాఁగ
వైరిషట్కౌఘములు గడువంగ మాయ
యనెడు జలధిని ద్రిప్పెడు నిను భజింతు.

సీ. కూర్మితో గజరాజు కోర్కెలు దీర్చి ధ
ర్మజ్ఞు ప్రహ్లాదు మనిచిన దొర!
నాఁడు పాంచాలిమానంబు నిల్పినసామి!
ధన్యుగా ధ్రువుఁజేయు దైవరాయ!
కృపవాయుసుతు నాదరించిన మాయన్న!
తిరుగు కాకముఁ బ్రోచు దేవదేవ!
రాతి నాతినిఁగాఁగ రచియించిన మహాత్మ!
మహివిభీషణుఁ బ్రోచు మాన్యచరిత!

తే.గీ. విదిత పశుకర్మ గురువైరి విగతమాను
నవగుణుని చలచిత్తునైచ్యాది విభవు
పరతరాసుర శీలుఁ నన్ గరుణఁజూచి
యాత్మదాసునిగాఁ జేయవయ్య! దేవ.

చ. ధర నినురాజమాత్మనివిధంబునఁ జూచితిచెల్ల! దోచితిన్
విరసములాడితిన్ భయముపీడితినన్ను మహాపరాధి యే
కరుణనుజూతువో యి!యిలఁగాతువొ? భారమునీదెయన్యథా
శరణమెఱుంగనయ్యయని సాగిలిగాఁబడి లేవకుండినన్.

ఉ. అప్పుడు కప్పమై దొరకృపారసమొప్పగఁ గన్నురెప్పలన్
జిప్పిలఁజూచి లేనగువుచే నిజదాసుని లేవనెత్తి నీ
విప్పగిదిన్ విచారపడ నేటికి? వైష్ణవదాసకోటికిన్
దప్పులుగల్గునెంచఁగలదా? వలదాకులదైన్యతహృద్గతుల్

సీ. అఖిలరూపములందు ననురూపములయందు
నందున మందపుణ్యమ్ము నందు
తలిదండ్రులందు నాతతమదాంశము నందు
మానుషంబైన జన్మంబునందు
అతఁడును నాభక్తుఁడై మహత్త్వముఁ జెందుఁ
గాన నాపదసేవ మానకుండు
నీవు మదీయప్రభావంబు నెటువంటి
వరమైన నిత్తు మామదిని గందు

తే. గీ. నహహా! లోకావనార్థ మత్స్యావతార
మైన మేమెంత దుర్జయుఁడైనఁగాని
సేవచేసిన రక్షించు బిరుదులూని
నాను నామేలు భక్తజనాగ్రయాయి!

కం. సారము నారంగాగా
గారమునంగనక చిత్రగని సప్తప్రా
కారము లొనరించితివే
నేరము నీకింక నీవె నేను కుమారా!

మ. అనఘాళ్వారులు గూర్చి నైగదురగా నానంద బాష్పాంబువుల్
కనుదోయింజనియింప హర్ష భయయుక్తంబైన చిత్తంబుతో
సనకాదిస్తుత పాదపద్ముఁడగు నాసర్వేశుతో భక్తిని
ట్లనియెన్ నైజశిర స్తటీఘటిత హస్తాంభోరుహద్వంద్వుఁడై.

సీ. కల్పవృక్షముయింటఁ గల్గినవారికిఁ
గాంక్షింపనేటికి గడ్డిపుడక
కామధేనువు దొడ్డిఁ గట్టినవారికిఁ
గోరనేటికి బక్క గొఱ్ఱెపిల్ల
అభినవామృత రసమబ్బినవారికి
అడుగనేటికిని వేపాకు పసరు
చింతామణిశ్రేణిఁ జెందినవారికి
కామించనేటికిఁ గరపరాయి

తే. గీ. అహహా ! బ్రహ్మమలకును లభ్యంబుగాని
నీదు కరుణాకటాక్షంబు నిండియున్న
నన్యవరమేమి ? వనిమోయియయ్య ! మాకుఁ
భక్తవత్సల ! గోవిందపరమపురుష !

చ. వరమిదె వేఁడమంచు బహువారముబల్కిన నొల్లకున్న కా
వరమని దోఁచునే యసురవాహినికిన్ జనకంబులై గడున్
వరనలినంబు నీజలభవంబులటంచు దిరస్కరించు దే
వరచరణంబులందు ననివారిత భక్తినొసంగుమచ్యుతా !

కం. మును కరిముఖ్యులఁ గడువే
డినఁ బ్రోచిన కరుణయెన్నటికిఁ గలుగుజనా
ర్దన! దొంగ తప్పుసేసిన
నను గాచినకృపకు నేమనంగలవాఁడన్.

సీ. కమలా మనోవినోదములు పాపాపనో
దములైన నీదుపాదములె గొలుతు
తాపత్ర యీవిభేదములు నిరస్త భే
దములైన నీదుపాదములె గొలుతు
తరుణాబ్జకృత వివాదములు భక్తిప్రమో
దములైన నీదుపాదములె గొలుతు
వేందాత నూపురవితతనాదములు శ్రీ
దములైన నీదుపాదములె గొలుతు

గీ. గాని యన్యవరంబుల నేను గోరఁ
దొలుత గజమెక్కి మఱి దిడ్డి దూరనేర
నిట్టి నామేర నిల్పు నీ వింపుమీర
భాసురాకార ! సంసార భయవిదూర !

మ. అరవిందాక్ష! ముకుంద! కృష్ణ! నరసింహా! శౌరి! గోవింద! శ్రీ
ధర! నారాయణ! వాసుదేవ! పరమాత్మా! భక్తసంరక్షకా!
హరి! వైకుంఠ! యనంత! చక్రధర! దైత్యారాతి! దీనార్తిసం
హరణా! తావకదాసదాసజనదాస్యం బిచ్చి రక్షింపవే.

4

ఉ. నావిని మందహాస వదనంబున వెన్నెలఁగాయు పద్మమే
మో? వికసించె నంచుజనముల్ మనముల్ వెఱఁగందిచూడఁ
ప్పావనశీలుఁ గన్గొని, కృపారసవర్ష వియుక్త హర్షక
ర్షావనదంబు గర్జిలిన చందమునం దనుజారి యిట్లనెన్.

సీ. వైనతేయవిరాజ మానప్రభావంబు
నాంజనేయునిమహితాత్మశక్తి
చెలువౌననంతుని శేషత్వమహిమంబు
నలవిభీషణుని పుణ్యజనవిభుత
ప్రహ్లాదసన్మార్గ పరదానతత్వంబు
శుకభాగవత జిత ప్రకటసూక్తి
శ్లాఘ్యమా భీష్మునిశాంతనవత్వంబు
నర్జును విజయభావాతిశయము

గీ. యుర్వి నీయందె కలదుగా యూహసేయఁ
దెలియ నివియన్నిఁ జేయ మదీయమాయ
పరమవైష్ణవ పుంభావ భాగధేయ!
నైష్ఠికవిధేయ! పరకాల నామధేయ!

మ. పరమానందముమీర నిష్టధనసంపద్వృద్ధి చేకూర మ
చ్చరణాంభోరుహభక్తసంతతి సమర్చాయోషినిండార ను
ర్వరవర్ధిల్లు మనంతశక్తి శుభదుర్వారైహికాముష్మికా
దరణీయస్ఫుట సౌఖ్యభావమున మద్దాసాగ్రగణ్యుండవై.

కం. చంద్రుఁడు సూర్యుఁడుఁ జుక్కలు
సంద్రంబులు గిరులు రామచంద్రునికథ ని
స్తంద్రత నెన్నాళ్ళుండు బు
ధేంద్రా! యన్నాళ్ళు వెలయు నీశుభచర్యల్.

మ. అనియా కౌరవచక్రవర్తి తిరుమంగాళ్వారునిం బ్రేమ పే
ర్కొని భేరీపటహాదిశబ్దతతులు దిక్కుల్నిండఁగా నిందిరా
వనితంగూడి మదేభరాడ్గతినిజావాసంబునుం బొందివా
రని కారుణ్యముచేత భక్తజనులన్ రక్షింపుచుండెన్ ధరన్.

మాలినీవృత్తము.

సమదరిపువిరామా! జానకీ చిత్తరామా!
విముఖపరశురామా! విశ్వజాలాభిరామా!
సమరసగదరామా! (సైలివిద్ధావిరామా!)
ప్రముదితమునిరామా! రామతీర్థాద్రిధామా!

కం. సర్వంసహాతిథుంర్వహ
గుర్వాశయఖర్వభక్తకోటీరుహా
సర్వసురశర్వదిష్టో
ర్గర్వతుమ... ... ... ...

కం. హరి లక్ష్మీసంవాదము
మఱి గోకులపాటి కూర్మమంత్రి రచించెన్
ధరనాచార్తికులజుఁడగు
హరిహరదాసుఁడు లిఖించె నానందమునన్.

గద్య

ఇతి శ్రీమన్నారాయణ చరణదాస్య పవిత్ర, గోగుల
పాటి బుచ్చియామాత్య పుత్త్రి, శ్రీమత్తిరుమల
పెద్దింటి సంపత్కుమార శ్రీవేంకటాచార్య దేశి
కానుగ్రహసనాథ, శ్రీకూర్మనాథ ప్రణీతం
బైన శ్రీలక్ష్మీనారాయణ సంవాద మహా
ప్రబంధంబు నందుఁ ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.



శ్రీరస్తు.

# లక్ష్మీనారాయణ సంవాదము.



## తృతీయాశ్వాసము.



### —: జగన్నాథస్వామివారి రాయబారము :—

వ. ఇట్లు స్వామి వేంచేసి కేళీవినోదము లనున్నయంత, మున్నీరు కన్నియ యెన్నఁగారాని క్రొన్నన విలుకాని వేదనం దూలి విరాళి సోలి ప్రతిక్షణంబు బ్రహ్మకల్పంబుగా నున్నఁ దాళఁజాలక బాలేందురేఖయను బాలికం బిలిచి తన కరంబునఁ గరంబును గాంతికరంబగు నుంగరం బాచెలిచేతికిచ్చి ఓనెచ్చెలీ! నీవిచ్చట తడవుసేయక నాప్రాణనాథుండగు శ్రీజగన్నాథుని దరికరిగి నావేదన విన్నవించి పతి నతిత్వరితగతిం దోడ్కొనిరమ్మను మని పనిచిన నదియు నతిత్వరితగతిం జని యిట్లనియె.

### —: ద రు వు :—

బాగాయె నీవిట్లు-జాగుఁజేసితిరయ్యా! జగన్నాయకా!
నీదు—యోగముకై లక్ష్మి-యుంగర మంపింది జగన్నాయకా!

ఆ-ఇమగోపత్తునని-యిట్లు చేతురోయి !॥ జగ॥
మదవతి స్రుక్కెను-మదన వేదనచేత॥ జగ॥
గడియ యుగంబుగ - గడపుచునున్నది॥ జగ॥
నీవు-తడవోనరించిన - తాళఁజాలదు కొమ్మ !॥ జగ॥
ఇంతి విరాళి నే - నెంతని దెల్పుదు॥ జగ॥
ఎంతో-చింతించు నే - వేళఁ జెక్కిటఁ జెయిఁజేర్చి॥ జగ॥
పిలిచిన పలుకదు - పిలువకున్నఁ బల్కు॥ జగ॥
గూటి-చిలుకలు పలికిన - నులికి దిగ్గునలేచు॥ జగ॥
కలికికన్నులనీరు - కొలుకుల దిగఁజారు॥ జగ॥
అంత-పలుచనిచెక్కుల - పైని కాలువలాయె॥ జగ॥
వనిత నీగుణములు - వర్ణించి భ్రమఁజెందు॥ జగ॥
నీ-కనికారమిటులేక - యునికి యబ్బురమాయె॥ జగ॥
తా ధవునిఁ జూడని - తనువేలయని పల్కు॥ జగ॥
నీకు-యువిదల భ్రమఁజెంది - యుండుట తగదురా !॥ జగ॥
ఉసురని తనకేల - నొసలంటుకొనునయ్య !॥ జగ॥
ఎంతో-విసమైతి పతికాని - వెతఁగుజెందునయ్య !॥ జగ॥
బతిమాలి యేలాగో - పతిని దెమ్మనునయ్య !॥ జగ॥
నీను-మది యెట్టులున్నదో?-మాకు తెలియదయ్యా!॥ జగ॥
చెలియ చిక్కియుంటె - తెలుపఁజాలమయ్యా !॥ జగ॥

అ-శలికియుంగరాము - కంకాణమాయెను॥ జగ॥
ఆలస్యమాయెను - బాల తాళదుర !॥ జగ॥
మా-కేలయున్నంత మీా - కెఱిగించినామయ్య॥ జగ॥
పలుమా రెంతనిమేము - తెలుపుదుసేతుము॥ జగ॥
మాకు-సెలవియ్యరయ్యా మీా - చిత్తమెట్లున్నదో॥ జగ॥

తే. గీ. అనిన జగదీశ్వరుం డిట్టు లనియెం జెలికి
సతివ ! మమ్ముల నిటుబిల్వనంపవలెన ?
సకియ ! యిక్కడికార్యముల్ జక్కఁజేసి
ఇంతలోపల వచ్చెద నింటి కనుమ !

సీ. చిన్నిముద్దులగుమ్మ సేమమ్ముఁ బలుమారు
నడిగితినని తెల్పు మంబుజాక్షి!
గబ్బిగుబ్బలు రెండుఁ గదియించి బిగ్గరఁ
గొమ్మఁ గౌఁగిటఁజేర్చుకొంటి ననుమ
తనవద్దఁ బ్రాణముల్ తనువు మాత్రం బిందు
యున్నది యని తెల్పు ముదితతోడ
నిక్కడకార్యముల్ చక్కఁగా నవరించి
యింతలో వత్తని యింతి కనుము

గీ. పొలఁతి నెమ్మదిఁ గోపంబు పుట్టకుండ
నేకరణిఁ దెల్పుచుందురో నీకె తెలియు
మగువ ! నీమేలు మరువను మాలతాంగి
మాసు బుచ్చుచు నోదార్చుచుండు నీవు.

—: అష్టదిక్పాలక సేవ :—

పదిలము సుమ్మీ మహేంద్రా!—నీవు
మదియందు వద్దు వద్దు తంద్రా !

1. సదయుఁడు గోపాల-స్వామి రుక్మిణితోడ
మృదుశయ్యనను వేడ్క-నిదురించియున్నాఁడు॥ ప॥

2. నీదిట్టము వదులరాదు చూడుమా-నాదమోదియౌ జగ
న్నాథుఁడు జాంబవతి నాదుకొనిమోదమున-అంతరంగ
మందున్నాడు॥ నీ॥

3. నీకే తెలియుసుమా ! శ్యామలదేవ-నీకే తెలియుసుమా!
చేకొని నీదిశ నేగుచునుండఁగ-వేకువదనుక దివాకర
తనయ!॥ నీ॥

4. ఇది మంచిఅవసరముసుమ్మీ !
ఓనైరృతేశ ! యిది మంచియవసరముసుమ్మీ !
కదసి సూర్యతనయతోడను-నిదురబోయెను నాదిదేవుం
డుదయమైనదనుక నీవు-పదిలముగనివసించియుండు॥యి॥

5. భద్రముగానుండుమా!ఓవరుణదేవ!భద్రముగానుండుమా
భద్రముగాను సుభద్రసమేతుఁడై-నిద్రించుచున్నాఁడు
నీరజలోచనుఁడు॥ భ॥

6. తెలుపఁగఁగలవేమి వాయుదేవ-తెలపఁగలవేమి
తెలుపఁగఁగలవేమి? తెలవారినదనుక-కదసి నీదిశనుండ
వలెనని పావన॥ తె॥

7. ఇంత గట్టిగనుండు మాఁటేరదేవ ! యింపొందు భార
ము నీయందెసుమి యరవిందదళలోచనుఁడు మిత్రవింద
మోవి విందుగోరుచు గోవిందుఁడు పవళించె। యి॥

8. జాగరూకతనుండుమా ! మహేశా ! జాగరూకతనుండు
భాగవేకునిదనుల్ భాగవతప్రార్థన ఓనాగభూషణా॥జా॥

—: కీర్తన :—

1. సెలవియ్యారయ్యా!-భక్తుల కెల్ల॥ సెల॥
ఎలమిసుభద్రతో కలిసికాముక కేళివలచనుండుడుగాని॥ సె॥
ఎలమి పట్టపుదేవి-లెనమందుగురు మిమ్ముఁ
బిలువ సకియలఁ బంపించినా వెలయు వారి మనసు
కలత జెందకుండకల వేణులతో యే కాంతమున్న దేమో। సె॥

3. ఆటలపాటల నలసితిరని లక్ష్మి బోటులందరకును గీటు
చును, చాటుమాటుననుండి సైఁగచేసి వారి పాటు
పుష్పశయ్యఁ బవ్వళింతురుగాని॥ సెల॥

4. చంద్రనగరమున - జగన్నాథుఁడవయి,
విజయముతో తేరు వివాహితులను, సుజనులఁ
బ్రోవ నక్కజముగా నలసితిరజవంద్య !
కూర్మదా ! సాఖ్యవంద్య ! నీకె తెలుసు॥ సెల॥

—: హారతి :—.

శ్లో॥ నీలాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే
సుభద్రా ప్రాణనాథాయ జగన్నాథాయ మంగళమ్॥

శ్లో॥ భద్రాచల నివాసాయ - భద్రాయ పరమాత్మనే
జానకీ ప్రాణనాథాయ వేంకటేశాయ మంగళమ్॥

—: పవళింపుసేవ :—

1. శ్రీజగన్నాథ ! యీపూజ గైకొనుమా
తేజముగఁ బుష్పములు - దేవతల్ దెచ్చినారు॥ శ్రీ॥
2. పారిజాతములు సురభక్తకుంకుమపుష్పవారవ నలుండు
పాటీరములు యముడు పుణ్యజనలు వేరు సంపెగలు
వరుణుడు కలువలునుదెచ్చినారుసత్కృప మీరు.
3. కలువలయు సౌగంధికములు యక్షేశ్వరుఁడుమరువమ్మ
నీశానుండ డవిమల్లికలువరసనుగొని తెచ్చిరి దేవరచంద్ర
నగరచంద్రనగర సుస్థిరవాస కూర్మదాస ! నిత్యపోష॥
హారతి॥

—: నైవేద్యము :—

సాపడవయ్యా ! శ్రీ గోపాలసామి ! యీవేళ నీకు వాపోవఁ
గా అరవై యార్యారు అవసరనైవేద్య దడిబెల్లము తేదడుపుకో
పుడిబెల్లముచేఁ బొదుపుకొని॥ సా॥

తాంబూలము (ఆనంధభైరవి ఆదితాళము)

1 కపురంపువిడెమందుకోరా!నీవువేగవిప్నులసగుణసాంద్రా!
తారతపనీయనిభములు తాంబూలిదళము
చపలాక్షి దుడుపులు చతురతతోనిచ్చె॥ కపు॥

2. ఘనమైన లవంగములు-శొంఠి-ఘనసార మిళిత పాత్రక ములు ఘనసు ముచ్చటదీర మంచిజాజి జాపత్రి యేల కులుగూర్చి వనజాక్షి యొసఁగెను॥ క॥
3. నిజభక్త హృదయానివాసా! నిమ్మ్మభజనసేయుచుఁ గూర్మదాసా!
వృజినము దొలఁగించి విజయనగరమున
భుజగశయనుఁడవై భోగించుసమయము॥ క॥

—ః శోభనము ః—

1. శోభనమెశోభనము నిత్యశోభనమె శోభనము నీలా చలమన సంశోభితుఁడగు గోవిందునకు శోభనమేకల శాబ్ధిఁబొడముహరి సుందరియైతగు నిందిరకును॥ శోభ॥
2. శోభనమే జగన్నాథులకు-శోభనమే శ్రీలక్ష్మికిని-శోభ నమే చంద్రనగరమున సురుచిరమాధవులకును॥ శోభ॥
3. శోభనకరుఁడైన, కూర్మదాసునిఁ బ్రోచిన కరుణానిధికి శోభనమే తనభక్తులకు శుభములనొసఁగిన కలుముల చెలికి॥ నిత్యశో॥

—ః లాలి ః—

1. లాలిశ్రీ చంద్రనగ రపు జగన్నాథా
జోలఁబాడెద నీకు శుభగుణసనాథా॥ లాలి॥
2. విసపుపూతనఁజంపి వెతనలసినావు
మసలకను బండిరక్కసుజెండినావు

పొసఁగసుడిగాలిసొంపులు ద్రుంచినావు
నిసువవటరా కృష్ణ ! నిదురించునీవు॥ లాలి॥

3. తొల్లింటివలె వెన్నదొంగిటటమాను
గొల్లభామలతోను గుసగుసలుమాను
తల్లిబుద్ధులు వినర ! ధర్మమదితాను
ముదితమదిఁబూచు॥ లాలి॥

4. ప్రకటకాళియ ఫణాగ్రములపై నెక్కి
తకిటధికిటయనుచుఁ దాండవముఁద్రొక్కి
యొకవింతచూపి నీ వుర్విఁ బెంపెక్కి
అకట ! విదళించుమీ కలనటలుదప్పి॥ లాలి॥

5. ద్వారకాపురినిల్చి ధరణిఁగౌరవుల
మారణము చేసి సమ్మతిని పాండవులఁ
గూరిమినిఁబ్రోచి, నినుఁగొలుచు మానవులు
చేరితిమి పవళించు భాగ్యదయదగుల॥ లాలి॥

6. జలకేళులొనరించు సతులచేలముల
నెలమిదొంగిలిపొన్న నెక్కి జాలమున
యిలఁ జెప్పకుందు రిది యేమి మేలము
వలదునాయన ! యిటువంటి చెయ్వులు॥ లాలి॥

7. స్వారి దుష్టసంఘములును మర్దించి
సంసారికై వడి సతులఁ గామించి
అంసమానలఁ బదియాశ్వేల నుంచి
సంసారముఁ జేతువు శయనించిమించి॥ లాలి॥

8. లాలి! శుభగుణబృంద! లాలితముకుంద!
లాలి! మునిచిత్తకమలాలి! సురబృంద
లాలి! యనవరతకమలాలి! సద్హృదయా!
లాలి! గోపబాల! లీలసంసదయా॥ లాలి॥

9. పురుషోత్తమను క్షేత్రమునుండి మీరు
దరి విజయనగరంబు దరినెయున్నారు
వరచంద్రనగరంబు వచ్చియున్నారు
సిరులిచ్చి మమ్ము రక్షింపుచున్నారు॥ లాలి॥

—: యేకాంతసేవ :—

1. శ్రీరమాంగన నిన్నుఁబాసి-చింత వేగుచునుండెరా
మారుఁడాపైఁ బూలశరముల మర్మమంటఁగ (నేసెరా)
సారెసారెకు నిన్నుఁబాసిన-క్షణముతాళఁగ లేదురా
రార! చంద్రనగరపురీశ్వర! రమణి నినుఁబిలిచిందిరా!

2. ఏలరా! చలమేలరా! చెలి నేలరా! యదిగోలరా!
చాల నీకై మరులఁజెందినచానరా! దయఁబూనరా!
నీలనీరదదేహ! యీగతి నీ కెవతె? బోధించెరా!
మేలు చంద్రనగరపురీశ్వర! నెలత నినుఁ బిలిచిందిరా!

3. ఇందిరావర! బంతిరా! మదమెక్కు కాముదంతిరా!
పంత మీగతిఁజేతురా! చెలిపైని నెనరిటు దాచురా!
వింతఁజేయగరాదురా! మరుబారి కోర్వఁగ లేదురా!
కాంత! చంద్రనగరపురీశ్వర! కాంత నినుఁబిలిచిందిరా!

4. అలుక నెన్నఁడుఁ జేసెనా? కల-నైన నిన్నెడఁబాసెనా?
చులకచూడఁగఁ జెల్లునా ?-సుదతిమదిరంజిల్లునా ?
చలమిదేటికిరార ! సామిఁక జాలమేటికి బంతముల్
వలదు చంద్రనగరపురీశ్వర వనిత నినుఁ బిల్చిందిరా !

5. కొమ్మ నీకై మల్లెమొగ్గలు కోసి దండలుగట్టెరా !
కమ్మకస్తురిచేత నుదుటను కల్కి తిలకము దిద్దెరా !
నెమ్మదిన్ దయబుట్టవలెనని నీకు దండము బెట్టెరా !
రమ్మ చంద్రనగరపురీశ్వర! రామ నినుఁ బిలిచిందిరా!

6. నేరమేమని మాటిమాటికి నీరు కన్నులనించురా !
మేరమీరిన విరహవేదనమించురా ! భ్రమయించురా !
మేరగాదుర నీకు నీగతి నెలఁతపై దయయుంచురా !
మేలు చంద్రనగరపురీశ్వర మెలఁత నినుఁబిలిచిందిరా!

7. గడియయుగముగఁ జూచురా!తనకర్మమనితలయూచెరా!
చెడుగువీఁడనిచంద్రుఁ దిట్టుచుఁ నేతులల్లనఁజాచెరా !
తడవుచేసినఁ దాళఁజాలదు తగవుఁదప్పక నీవు రా !
వడిగఁ జంద్రనగరపురీశ్వర ! వనిత నినుఁ బిలిచిందిరా !

8. మారువేదన తాళఁజాలదు మానినీమణి సోలెరా !
భూరితాపము వెగ్గలంబుగఁ బూలపాన్పున వాలెరా !
కోరి నిన్నున్ వేడినదిరా ! కూర్మదాస వరప్రదా !
శౌర ! చంద్రనగరపురీశ్వర! యతివ నినుఁబిలచిందిరా!

—: దరువు :—

1. సరగుణ విరిబాణునివలెవచ్చెను-సకియరో! యితఁడెవరు?
ధరణి సుమిత్రపురమునవెలసిన కరివరదుఁ డితఁడె।
2. చరణముల్ జీరాడెను పీతాంబరధరుఁ డితఁ డెవరె?
గోవులు గాయుచు గిరి ధరియించిన గోపాలుఁ డితఁడె॥
3. పులుగుల తేఁడు త త్తడి నెక్కిన పురుషుఁ డితఁడెవడె?॥
వెలఁదుక ! యలివేల్మంగను గూడిన వెంకటేశుఁ డితఁడె
4. తలుపుతియ్యవే ఓకొమ్మా ! తళుకుకలీను ముద్దుగుమ్మా!
తలిరువిలుకారింపు రెమ్మ ! గులుకుకుందనపుబొమ్మా !

—: తలుపుదగ్గిరపాట :—

1. భళిసామిగా ! నీ వీవేళ ! - సెలవుదప్పివచ్చి చాలపిలిచేవు
నీకిదిమేల ? తలుపు గొట్టెదవు నీకేల ? తలపెరుఁగని వల
పెరుగుపోర ! శ్రీజగ॥
2. చాలాపొద్దాయెనే భామ! స్వారివెళ్ళి వచ్చినాఁడా
బాలరో ? నీవునాతో పవళించి వాలేనివాఁడ॥ తలు॥
3. యీ రేయి యిక్కడను కొన్ని యేమేమో మాయలుబన్ని.
కేరడములాడేవన్ని పోరా నీప్రియురాలివన్ని॥ తలుపు॥
4. ఎంతబతిమాలినఁగాని యేలదయరాదు నాపైని యింత
నిర్దయ మదిఁబూని లేతురటే లేనివన్ని॥ తలుపు॥
5. వంతబతిమాలకేమి ? యెగసక్కెముగాకసామి !
పెంపుతాహారమమెగాని పొసఁగదుర వాపోరమె॥ తలుపు॥

* —: దరువు :—

చలమేల నాతోను సకియరో లేవె! తలకువిలుతుడు నాపై
దండెత్తి రావె!
దండెత్తదరఁటరాయ దరలక్ష్మి బాసిపుండరీకాక్షునిపుడెల్లడాసి!
ఏపాపమెఱుఁగ - నన్నిటులాడమాన వి
వాదు లేకున్న నే తాళలేను!
ఫలమేమి? యీవట్టి పలుకులు నీకు
జలజాక్షనీపొందు చాలుర! మాకు!
నీవేమినావల్ల నేరమెంచితివి - భావముదాచకబలుకుసమ్మతిని
నేరము లేకున్నని క్కమెవ్వారుస్వారిలోయీలాగు జాగుచేసేరు
వనములోపల మునుల రక్షించుపనిచే
జాగాయె నాపయి దయయుంచు
వనములోపల దిరుగువారికి సామి కడుదోయి విడెమంట
కారణమేమి?
విడియపురుచి కాదు వెలఁదిరో! చూడు! కడుభాగ్య
రత్న రేఖలు నీయాతోడు
నీలంబుబలుతల్పునీలోనె రెండు ముత్యాలకుంకుమ జెంద
జాడ నెలవిమ్మ
నీకోపదృష్టినానిద్దంపుసొమ్ముపై కొని తెగ రె తెపలికించె నమ్మ
ఏజాడదాచెద యిదుగో నీ మేనగాజుజోడొత్తి నగరు
లుండెె సేనా

* ఈపాట యొట్టినియమములేవ లాంగక యగమ్యముగా నున్నది.

వేడిదైత్యులఁగొట్టేవేళ నామేన చాడిమాడికోరుఘాతలె
చానా !

బొంక నేరుతువు పోరయిక్కడికి - పొంకము లేని తక్కుల
కెక్కడిక్కి.

క. కలనైన నీకు మిక్కిలి
చెలియందలపోయ నామచిత్తములోనన్
చిలుకలకొలికీ! నాపైఁ
బలుకులు కల్పించి యిట్లు పలుకఁగనగునే?

సీ. నుదిటిపై లత్తుక కదిసియున్నదొ లేదొ
తరుణేందునిటల ! యద్దంబు చూడు
కన్నులు మెట్టనై గన్పట్టెనో లేదొ
తామరసాక్ష! యద్దంబు చూడు
చెక్కిటిపైఁ గోటిచెణకు లున్నవొ లేవొ
దర్పణగండ ! యద్దంబు చూడు !
పెదవిపైఁ బలుకెంపు లొదవియున్నవొ లేదొ
బింబాధరోష్ఠ ! యద్దంబు చూడు

తే. గీ. వదనమున్నది యద్దమున్నది మరేల ?
(శ్రీ)జగన్నాథ ! రాధికాచిత్తలోల !
దాపరంబేల ? యిప్పు డద్దంబు చూడు

—: దర్వు-అటతాళము :—

అలసితి వేటలో అలసటతీర్చవే ఆదిలక్ష్మీ!

అల్ల-నాతిగుండె మెత్తనైతె చాలుర నీకు జగన్నాయకా!
ఘనకుచసంగతి మనసు కఠినమాయె ఆదిలక్ష్మీ!

దాని-ఘనకుచనిహతి మనసు గట్టి? జగన్నాయకా!
మోము చూపి నాదు మోహము తీర్చవె ఆదిలక్ష్మీ!

దాని-మోముచూడ నీమోహముతీరును జగన్నాయకా!
అన్నలాగు కళంకత్వముఁ గట్టేవు ఆదిలక్ష్మీ!

మా-అన్నయంతటివాఁడు నాలము ధరించెను జగన్నాయకా!
గడియ యుగంబాయె గడియదీయవేమి? ఆదిలక్ష్మీ!

నే-గడియఁ దీయకుంటే గడియద నీకేమి జగన్నాయకా!
తలుపు తీయవేమి? తప్పు నేఁ జేసితి ఆదిలక్ష్మీ!

నీ-తలపెఱుఁగక నేను తలుపు తీసుటెతప్పు జగన్నాయకా!
తడసి తీమరునం (పు) ననుమీరినావేమి? ఆదిలక్ష్మీ!

నీవు-తడయక అలదాని పడకిల్లు దూరుర జగన్నాయకా!

దాని-నడకలు......నీదగ్గర సాగునా ఆదిలక్ష్మీ!
అలదానిపైఁ గరుణ నాపలేవుర! కృష్ణ జగన్నాయకా!
ప్రేమ వేడినకొద్ది విజ్జృంభిగెదవేమె? ఆదిలక్ష్మీ!

అవురా!-సామి ! నాబిగువేమి ? సాగు నీముందర జగన్నాయకా!
చనువిచ్చి మరునంపినను మీరినామేమె ? ఆదిలక్ష్మీ !

చాలా-చనువిచ్చిపుచ్చుకొన్నను తాళలేవురా జగన్నాయకా !
(శ్రీ॥ జగ॥

—: ఆదితాళము. :—

మీనమునయి చదువులఁ దెచ్చిన శ్రీనాథుఁడనె బాలా!
మీనుపై తే(ను) మీకేమి?తక్కువ మీనాక్షుఁడవోయి
కూర్మమునయి అమృతముఁ దెచ్చిన గోవిందుఁడనె బాలా
కూర్మమవయి తేను కూర్మియున్నదరికికోరినీవు పోవోయి!
నాదికిటికినై ధరదాల్చిన అచ్యుతుఁడను బాలా !
ఆదికిటికిఁదగు ఆపంకజముఖి అక్కడికె పోవోయి !
నరమృగమూర్తిని దనుజవధించిన నారాయణుఁడను బాలా
నరమృగకాంతలఁగూడియాడు మా తెరవురాకుపోవోయి
గుజ్జురూపమున బలిని నణఁచిన ముకుందుఁడనె బాలా
గుజ్జుదానికి నీకు మంచివట బొంకనేల పోవోయి
రాజుల తేజముల నణఁచి చెలంగిన రాముఁడనో బాలా!
రాజతేజమణఁచఁగలవదనము రామలకే పోవోయి !
బంగారుబొమ్మారో? సీతారాములపైని దయ రాదటె బాలా
బంగారుబొమ్మకు భ్రమసితివింక నాపై నెందుకు? పోవోయి

నీలాంబరుఁ డనఁగ నిల వెలసినవాఁడ నో బాలా !
లాంబరామధ్యాసక్తుఁడ వీఁక నేనేటికి పోవోయి !
పరకాంతలవ్రతముల భంగించిన బుద్ధుఁడనె బాలా !
పరకాంతలవ్రతముల భంగించు వరసతులకే పోవోయి !
కలికిమూర్తినయి కలియుగదైత్యుల గండఁణచితినె బాలా!
కలికిమూర్తివయి (కే) కైసరి లేదాకలికిదరికి పోవోయి !

—: దరువు. :—

నేరము నావల లక్ష్మి ! లేనివాఁడనె నీరజలోచన !
యిఁకనిను విడనాఁడ గారవించి తలుపుతీసి కౌఁగలియ్యవె ।
చేరికతో నామనవి చిత్తగించవలె యోఁ! నాసామి ! నీకేమి ?
నేరము రార !

చేరితిని తలుపు తీసి చెలఁగి చేకోరా !

ఈరీతి నిన్నాడితి నానేరముఁ గాచి, గారవించి మ్రొక్కెదను కరుణతోఁ బ్రోచి, ఆదిలక్ష్మి జగన్నాథు లలుకలు తీరి మిగుల ముదమొందిరి కలసి ముచ్చట్లాడిరి, చేరి చంద్రనగరమను క్షేత్రసీమను పాలించిరి

భక్తులను పరమప్రేమను యిల కూర్మదాసుఁ డొనర్చు యీ సంవాదము మిగులఁ బలికె భక్తులకెల్ల ఫలసంవాదము.

—:లాలి పాట.:—

1. లాలి! సీతారామ! లాలి! రఘురామా!-లాలి తారక
నామ! రణరంగభీమ!॥ లా॥

2. శ్రీరామరత్నంబు సీతగానేలి-కోరి భద్రాద్రివైకుంఠము
నఁ జేరి వైష్ణవు లమరవీథులను జేరి-వీరరాఘవుఁడైన
విష్ణుఁడవు లాలి!॥ లా॥

2. తొలుత బ్రహ్మాండంబు తొట్టి గావించి-నలువొంద వే
దముల గొలుసు లమరించి
బలువైన ఫణిరాజుఁ బాన్పుగావించి-చెలుల డోలికలో
ను చేర్చి గావించి॥ లా॥

3. జాళువనిద్దంపుసరిపెనలు మీరఁ-బాలిండ్లపైఁ గుల్కు-
పయ్యెదలు జార
వారిచూపులు డాలువామిగమి గార-జోలఁ బాడెదరు
మీజోల నోహూర॥ లా॥

4. పొంకముగఁ గనకతాటంకములు మెఱయ-కంకణాదులు
ఘల్లుఘల్లుమని మ్రోయ
కింకిణీరవములు తీర్ణమైకలియ-పంజాక్షులు నెనరుఁ బ
ల్కువిని మొఱయ॥ లా॥

5. బలువైనజన్నంపుఁ బాయసములోన-దరమొప్ప దశరథ
వరపట్టివైన

కలకంఠి కౌసల్యగర్భంబులోనఁ-గలగితివి మాపాలగల
పెన్నిధాన॥ లా॥

6. అలరి తాటకశిరంబులు గూలనేసి-సదమలంబుగ మౌని
జన్నంబుఁగాచి
పాదరేణువుఁరాయిఁ బణఁతిగాఁజేసి-కదనశూరుఁడవయ్యు!
కనకాంబురాశి॥ లా॥

7. జనకరాజింట ధూర్జటి విల్లు విరచి-జనకజను బెండ్లాడి
శౌర్యంబు మెఱసి
ఘనుఁడైన పరశురాముని భంగపఱచి-వినుతి కెక్కిన
పూర్ణ విజ్ఞానసరసి॥ లా॥

8. జనకసుత వెనుక లక్ష్మణుఁ డేగుఁదేర-జనకుఁ డాదశరథు
ల సఖ్యమీడేర
వనవాసమునకు సయ్యన నేగుఁదేర-వనజాక్షిసీత పావన
చిత్తచోర !॥ లా॥

9. దినదినము జాహ్నవీతీరమునఁ జేరి-వెనుక మఱిదండకా
విపినమును జేరి
రణమునను విరాధిరాక్షసులఁజేరి-ఘనుఁడవైనట్టి భీకర
రామశౌరి॥ లా॥

10. కనకమృగమైన రక్కసు స్రుక్కణంచి-జనకజను గొం
పోయి వనములోనుంచి

కని జటాయుని మూర్ఛగతిని-జెందించి తగ శబరి భుక్త
శేషము లారగించి॥ లా॥

11. బలుడైన సుగ్రీవు బంటుగా నేలి-చలముతోడనునొక్క
శరమునను వాలి
నిలఁ ద్రుంచి వనచరాదులఁగూడఁ దోలి-బలముతో
నడచు మాతండ్రి వనమాలి !॥ లా॥

12. హనుమంతుఁ డరిగి సీతనుగన్నజాడ-వెనుకలోకముల్లెల్ల
వెఱఁగందిచూడ
వనధిబంధించితివి వనచరులతోడ - ఘనమూర్తివయ్యా!
చక్కని చిన్నిప్రోడ॥ లా॥

13. కపులతోడఁతను లంకను జుట్టముట్టి-కపటరావణకుంభ
కర్ణులను గొట్టి
విపులవిక్రమశక్తి విదళించినట్టు-తపన తేజుఁడవైన దశ
రథుని పట్టి॥ లా॥

14. పగవానితమ్మునికిఁ బట్టంబు గట్టి-మగువతో నయోధ్య
మార్గంబు పట్టి
మగుడఁ దొల్లిటిరాజ్యమహిమ, చేపట్టి-జగమెల్ల నేలి
తివి దశరథునిపట్టి !॥ లా॥

15. పొంచి మిముఁజాల లాలించేము ప్రేమ-మంచికోరిక
లొసఁగి మన్నించు రామ !

కంచిలోహరివైన కాకుత్స్థరామా! -పంచబాణునిఁ
గన్న భద్రాద్రిరామా!॥ లాలి॥

గద్య

ఇతి శ్రీమన్నారాయణ చరణదాస్య పవిత్ర, గోగులపాటి
బుచ్చియామాత్య పుత్త్ర, శ్రీమత్తిరుమల పెద్దింటి
సంపత్కుమార శ్రీ వేంకటాచార్య దేశికాను
గ్రహసనాథ, శ్రీకూర్మనాథ ప్రణీతం
బైన శ్రీలక్ష్మీనారాయణ సంవాద
మహా ప్రబంధంబు నందు
తృతీయాశ్వాసము
సంపూర్ణము.



శ్రీః

# సుందరీమణిశతకము.



శ్రీలలరంగఁ జంద్రకళ చెల్వున లేనునవ్వువెన్నెలల్
గీలుకొనంగ నంగజశిలీముఖరీతిఁ జెలంగుచున్న నీ
లీల కనుంగొనంగ నవలీల నఖండసమస్తభూతలం
బేలినకన్న సౌఖ్య మని యెంతుఁ జుమీ మది సుందరీమణీ!

చ. నినుఁ దొలునాఁటికూటమిని నేరుపుఁతో జెలులెల్ల మెల్ల మె
ల్లనె పడకింటిలోని కొకలాగునఁ దెచ్చిననాఁటి సిగ్గుతో
నెనసిన యోరచూపులిఁక నేమననాఁటను గల్వదండలో
యన వెలుఁగొందె నేఁటికెదనంటిన ముల్కులు సుందరీమణీ.

ఉ. ముసిముసినవ్వుతోఁ జిగురుమోవి కదల్పుచుఁ జన్నదోయినె
న్నొసలు చమర్చఁగా ననుఁ గనుంగొని నానమరల్చుజూపులఁ
య్యసమశరుండు మున్నుయెదనంటఁ గ్రుచ్చి పెగల్చు పూవునా
రసములనంగఁ దోఁచఁగదరంబులె యోర్వఁగ సుందరీమణీ.

చ. సరసములాడు నేర్పు కనుసైగలు సేసెడు నేర్పు నామనం
బెఱిఁగెడు నేర్పు నెమ్మది నొకించుక కోపము సేయు నేర్పు క్ర
మ్మఱ మురిపెంబుతోడ బ్రతిమాలెడు నేర్పు మనోజకేళిలోఁ
గరఁగెడు నేర్పు నీకె తగుఁగాదె తలంపఁగ సుందరీమణీ!

ఉ. పాపటదీర్చి నెన్నొసటిపై నునుపై యసియూను చేసుచు
కొప్పయిఁ గూర్చి గుబ్బలనొయారపుఁ జాఱు పయంట చేర్చి వాల్
జూపుల నాదుమానసము చూఱఁగొనన్ సొగసైన రత్నపుం
దీపములాగ నా యెదుర నిల్చుట యెన్నఁడొ సుందరీమణీ!

ఉ. క్రొమ్ముడివీడ గబ్బిచనుగుబ్బలపేరులు చింద నత్తుము
త్యమ్ము చలింపఁ గేలు కడియమ్ములచప్పుడు లుప్పతిల్ల తేఁ
జెమ్మటమేనుగ్రమ్మ మగఁ జేఁతలుసేయుచు మోవితేనె తే
తెమ్మని చొక్కుగొట్టుదువె! దిట్టతనమ్మున సుందరీమణీ!

చ. పదకటకంబు ఘల్లురనఁ బైకిఁ జివాలున వ్రాలి గుబ్బలుం
గదుములు కట్ట ఱొమ్మదిమి గంటుగ వాతెఱ నొక్కి మైగగు
ర్పొదవఁగఁ బయ్యెదం జెమటలొత్తుచుఁ గేరుచుఁ గ్రిందుమీఁదుగాఁ
బొదువుచు నీవె నన్ గవయుపోడుములెన్నఁడు సుందరీమణీ!

చ. అలిగినవేళనైన మొగ మారసి నవ్వకమానలేవు కౌఁ
గిలివదలంగలేవు తమిగేల్కొనఁగా నిదురించునప్పుడుం
గలయికనైన నేనలయఁగాఁగని పైకొనకోర్వలేవు, నీ
చెలిమి, దలంచి, యేకరణిఁ జెందెద ధైర్యము సుందరీమణీ!

చ. తళుకు,లదొంతి, పూఁబలు, తుదంతి! కడానిశలాక! కెంపురా
మొలక! మెఱుంగుఁదీవ! నునుముత్తెమ! చక్కఁదనాలకుప్ప! యొ
ప్పులగని! ముద్దుగుమ్మ! యనిపొంగుచు నే వెయినోళ్లచేత నీ
చెలువము మెచ్చికొందుఁ దమిచిత్తములోపల సుందరీమణీ.

చ. మును కనుఱెప్పవేయుక్షణమున్ యుగరీతిని దోఁచు నట్టి నే
నినునెడఁబాయఁ బ్రాణములు నిల్చె, నిదేమని కొంతసేపు నె
మ్మనమునఁ జింతచేసి వినుమా పరికించితి నంతలోనె నీ
ఘనమధురాధరామృతము కారణమా నని సుందరీమణీ!

ఉ. బంగరుతీఁగెవంటి మెయి పట్టెఁడు గుబ్బలు, చేరెఁడేసి క
న్నుంగలువల్ కనన్ మినుమినుక్కనుకొన్ బలుమేల్ పిఱుందుఁజం
కుం గళలుల్లసిల్ల నిటలమున్ సిరి చుక్కయనంగవచ్చి మా
ముంగలనిల్చునెన్నఁడొకొ ముచ్చటదీరఁగ సుందరీమణీ.

చ. తమమధురత్వసంపదగదా యిది దొంగిలెనంచుమోదన
య్యమృతపుబిందువో యనఁగనందమునందగుముక్కునత్తుము
త్యమునునుమోవిమాటికినిదాకుచునుండఁగఁ బూరుషాయిత
క్రమమునమంచు నిన్ దలఁపఁగాఁ గరఁగుం మది సుందరీమణీ.

చ. చెలఁగుచు మీఱిపైదనును జెక్కులు గోరులనొక్కుకున్న మె
చ్చులుగల నీదుమోవి చవిచూడకయుండిన నీదుపల్కులూ
హాలఁ గొనకున్న నీతళుకు లందము నీగుజరాతి కెంపు లీ
చిలుకలు నేలనేగణనసేతునె ? వీనిని సుందరీమణీ!

చ. అలుకయిదేమిరా! వెగటులాడకురా ! దయతోడజూడరా!
పలుకవిదేలరా! గడుసు పల్కులెఱుంగని చిన్నదానరా!
చెలిమిఁదలంపరా! మనవిచేకొనరా వినరా మనోహరా!
చెలువుఁడయున్ననీ నెనరు చిత్తమువాయదు సుందరీమణీ!

చ. తలలొకయింతమెత్తి నను దళ్కులుపై వెదజల్లిగొంటుపోఁ
కలవలెనుండి బంతులయి గట్టితనంబున కొల్లగట్టి చెం
తల నెఱినిండె నాంతరసుధాకలశంబులఁ గేరు నీకుచం
బులఁ బవళించి, నేఁ దనివిఁ బొందుటయెన్నఁడొ సుందరీమణీ.

చ. రతిఁ జిగురాకువంటి యధరంబు చుఱుక్కనఁ బంటనొక్కి సీ
త్కృతియొనరించి, బొమ్మముడిదేరఁగ నోరగఁజూచి, నీకు నీ
గతినొనరించ నేర్తునని, గంటుగ నా నునుమోవినొక్కి నా
చ్చితివె యటంచుఁ గేలఁ బరిశీలనచేతువె సుందరీమణీ!

చ. చెలఁగి కికాకికన్నగుచుఁ జిల్కలమంచముమీఁదఁ గేరుచున్
గులుకుమెఱుంగుగబ్బిచనుగుబ్బ లురమ్మునఁగూర్చి రేపవల్
తెలియకయుండువేళ సుదతీ! నిను నన్నెడబాపినట్టి యా
నలువకుఁ బూజలేదుగద! నాఁటికి నేఁటికి సుందరీమణీ!

చ. చిలుకలకొల్కి! నీనగవుచిక్కఁడు నెమ్మొగ మొక్కమాఱుక
న్నులఁగనుఁగొన్న నాఁడుమదనుండుననుంగరుణించుగాక! యో
చెలి, నినుఁబాసి వ్యర్థగతిఁ జెందిననాఁడకటా! మరుండు కే
వలమతికర్కశాస్త్రములవంచును నొంచును సుందరీమణీ.

ఉ. కాటుకకంటి నిగ్గులెసఁగం బొసఁగంగను నీకటాక్షమై
నాటెను ఱొమ్ము తాళఁగలనా లలనా యిదిగాక కప్రపుఁ
బీటి యొసంగుచుం బికిలిపిట్టవగం, గవగన్ననాఁటి నీ
మాటము లెన్న గుండెకరఁగుఁ జరగుఁ ధృతి సుందరీమణీ.

చ. సొలయక నీవు పౌరుషముఁ జూపుచుఁ గంతురణంబొనర్ప నే
నలకలు గోళ్ళదువ్వి, తెలనాకుల చుట్టలొసంగి, తావి పు
వ్వుల సురటీలవీవ, నునుపుంగవున్నల్లన బిగ్గఁబట్టి, నీవు యిం
పులఁబరిచర్యసేఁత దలపోయుదొ లేదొకో సుందరీమణీ

ఉ. మించు ధర న్నటించె లత మేదినిపైఁ జరియించెనేమొ కో
యంచుఁ దలంచుచున్నతరి నచ్చపుబంగరుబొమ్మకైతి మ
త్కాంచనసౌధసన్నిధిని గాంచి మదీయతపఃఫలంబె కా
నెంచెద నన్నునమ్ముము రతీశునిసాక్షిగ సుందరీమణీ!

ఉ. చక్కెర బొమ్మ! నీమొగముచక్కదనంబుపిఱుందునం దమా
చెక్కుల చెక్కుపల్వరుసచెల్వము నూరులతీరు లయ్యరే!
యెక్కడఁజూడనీవె కృపనించుక చూడకయున్న మానునే?
చక్కెర వింటిదంట సుమసాయకమేయక సుందరీమణీ!

ఉ. నేఁటికి నిండె నాతపము నిక్కమటంచు సుఖించియుంటి, స
య్యాటల నాటపాటల నొయారపుదేటల ముద్దుమాటలన్
గూటమి నేలు నిన్నుఁగని కోమలి! నిన్నడబాసియుంటి నీ
నాఁటికి నేది మున్నెడ నొనర్చితినో యిట సుందరీమణీ!

చ. బహుతరలజ్జఁ గన్ను లొకపాళముగాముకుళించి, నీయురో
రుహముల నీవిపైఁ గరసరోజములుంచి, తొడల్ బిగించ నే
రహివలువెల్లఁ బాపఁగఁ బిరాలునఁ దొల్తిటికూటమిన్ స్వయం
గ్రహణమొనర్చినట్టి యుపకారిణి వౌదువె సుందరీమణీ!

ఉ. అందెల నాదుచొప్పణఁచి, యల్లనమెల్లనవచ్చి కేళికా
మందిరశయ్య నిద్రగను మాడ్కివసించిన నాదుచెక్కులిం
పొందఁగ ముద్దుపెట్టుకొనుచుండఁగ నేఁ జిఱునవ్వు, నవ్వ, ల
జ్జందగు నిన్ను గేళి నెకసక్కెముచేయుదు సుందరీమణీ.

ఉ. మించు ధర న్నటించె లత మేదినిపైఁ జరియించెనేమొ కో
యంచుఁ దలంచుచున్నతరి నచ్చపుబంగరుబొమ్మకైతి మ
త్కాంచనసౌధసన్నిధిని గాంచి మదీయతపఃఫలంబెకా
నెంచెద నన్నునమ్ముము రతీశునిసాక్షిగ సుందరీమణీ !

ఉ. చక్కెర బొమ్మ! నీమొగముచక్కదనంబుపిఱుందుసందమూ
చెక్కుల టెక్కుపల్వరుసచెల్వము నూరులతీరు లయ్యరే !
యెక్కడఁజూడనీవె కృపనించుక చూడకయున్న మానునే?
చక్కెర వింటిదంట సుమసాయకమేయక సుందరీమణీ!

ఉ. నేఁటికి నిండె నాతపము నిక్కమటంచు సుఖించియుంటి, స
య్యాటల నాటపాటల నొయారపుదేటల ముద్దుమాటలన్
గూటమినేలు నిన్నుఁగని కోమలి ! నిన్నెడబాసియుంటి నీ
నాఁటికి నేది మున్నెడ నొనర్చితినో యిటు సుందరీమణీ!

చ. బహుతరలజ్జఁ గన్ను లొకపాళముగాముకుళించి, నీయురో
రుహముల నీవిపైఁగరసరోజములుంచి, తొడల్ బిగించ నే
రహివలువెల్లఁబాపఁగఁబిరాలునఁదొల్తటికూటమిన్ స్వయం
గ్రహణమొనర్చినట్టి యుపకారిణి వౌదువె సుందరీమణీ!

ఉ. అందెల నాదుచొప్పణఁచి, యల్లనమెల్లనవచ్చి కేళికా
మందిరశయ్య నిద్రగను మాడ్కివసించిన నాదుచెక్కులిం
పొందఁగ ముద్దుపెట్టుకొనుచుండఁగనేఁ జిఱునవ్వు, నవ్వ, ల
జ్జందగు నిన్ను గేలి నెకసక్కెముచేయుదు సుందరీమణీ.

చ. ఎటులికఁ దెల్లవాఱె నెలవీయర నీయురంబు నాను సం
దిట నిడినావు నాపదము నీపదముల్ మెలవైచి తేమొకో
చిటిపొటిచేఁత చేసెదవె! సిగ్గులచే టిపు డేమటంచుఁ గౌఁ
గిటఁ బ్రతిమాలు నిన్ బలిమిఁ గేళిమొనర్తు సుందరీమణీ.

ఉ. చెమ్మటనంటు ముంగురులు చిందినకస్తురిబొట్టు నిద్దురం
గ్రమ్మెడుకన్నులున్ జెదరుకాటుకయున్ నెలవంకలున్ వినో
దమ్మగు తళ్కుఁజెక్కులు రదక్షతలక్షితమైన మోవిచే
నిమ్మగు నీమొగంబు గను టెన్నఁడు ప్రొద్దున సుందరీమణీ.

ఉ. వాడినమోముతోఁ దొగరువాతెఱతోఁ బలుగెంపుగుంపుతో
వీడినకొప్పుతో సొలపుఁ జింతలతో ననుఁ బాసిపోవఁ గా
ళ్లాడనియట్లు తొట్రుపడు నందపు నెన్నడతోడఁ బ్రొద్దునన్
వేడుకఁ గేళిమందిరము వెల్వడుచుందువు సుందరీమణీ!

ఉ. సోయగ ముప్పతిల్ల ననుఁ జూచి కిసాలున నవ్వి లేచి, రా
రా! యని కౌఁగిలింపుచుఁ బిరాలున శయ్యకు వ్రాలిగుబ్బలన్
నాయురమాని మోవిరదనంబున నొక్కుచుఁ జొక్కిచొక్కి యూ
హూ! యని సైఁగ నన్ బలుకకుండ నదల్తువె సుందరీమణీ!

ఉ. పాయఁగలేని మోహమున బంతులవాటికుచద్వయంబు చే
దోయి నమర్చి, కేళితమి తోపుఁ గామశతాంగచక్రపుం
జాములపైకి దొర్లినను, శయ్యను బ్రాల్చి పరాకటంచు మే
నాయితలీల మెచ్చుగొను నవ్యశశీలవె సుందరీమణీ!

ఉ. మించెడువేడ్కఁ బైకొని రమించెడుచోఁ గటిమీఁద వేణి స
ర్త్రించుటయొప్పు రాచిలుక తేజిమనోజుఁడు చౌపటాలి ద్రొ
క్కించుచుఁ జిత్రభంగి ధుమికింపుచు నీలకశాహతిం దుటా
యించినలాగు నాసొగసు లెన్నఁగశక్యమె! సుందరీమణీ!

ఉ. మోహముమీఱఁబంచశరమోహరమొగ్గినవేళఁగుల్కు నీ
సాహస మేమనన్ బయికిఁ జంగునదాఁటి చెలంగి కేళిలో
నీహెనరెల్ల నేర్పఱుపు నేర్పరివౌదువు విస్ఫురద్వరా
రోహయటన్న పేరు దగు రూఢిగ నీయెడ సుందరీమణీ!

చ. అలితతిమ్రోఁతకున్ శుకపికావళికూఁతకు మంటమారిపూ
విలుతుని కత్తికోఁతకు నవీనసమీరకుమారునేఁతకున్
బొలుపుఁగజంద్రుపెల్లుడుకపోఁతకుఁ గ్రొవ్విరిమల్లెపూఁతకున్
జలనమునొంది గుండె ఝలుఝల్లుమనెంగదె సుందరీమణీ!

చ. జడ కటిసంచరింప, బురుసాపనిచీరెపయిఁ బెఱుంగు పా
వడతళుకుల్ నటింప, బిగివద్రువగుబ్బలరత్నహారముల్
తడఁబడి సందడింప, మరుతంత్రము లందియ లుగ్గడింపఁగాఁ
బడకకువచ్చు నీసొబగు భావముఁ బాయదు సుందరీమణీ!

చ. కొదమమిటారిచన్నుఁగవ గోరులపోటుమెఱుంగువాతెఱన్
గుదిరినపచ్చికాటుకనుఁ గోనలనిద్దురపాటు చెమ్మటల్
కదలెడుమేనునీటు పదకంజములన్ దడఁబాటు, జారుప
య్యెఁదయెదమాటు, నీవు పడకిల్ వెడలందగు సుందరీమణీ!

ఉ. నీకడకంటిచూపు, బలునిద్దపు నీచనుబోయి ప్రాపు, నన్
బైకొనుకోపు, నీజిలుగుబంగరుమైనునుతాపు, నీసుధా
స్తోకరదాంశుకంబు చవిచూపు, దయామతిదాపు, నీవె నన్
జేకొనుకోపులేక గడెసేపు రుచించదు సుందరీమణీ!

చ. చిలుకపలుమావజీరు విరిసింగిణిఁగూర్చిన క్రొత్తవింత పూ
జిలుకవు వాపయింగరుణచిల్క విదేమి మెఱుంగురత్నపుం
బలుకవు, కప్పురంబులికపల్క విదేమియటంచు నిన్న నే
నలిగినవేళ వేఁడుకొను టాత్మఁదలంపవె సుందరీమణీ!

ఉ. కోపము మానవే, నెనరుగూర్చిన చల్లనిచూపువెన్నెలల్
నాపయిఁజల్లవే చలము నాయమె బిగ్గఱఁగౌఁగిలింపవే
యోపువుఁబోఁడి! యోరమణి! యోచెలి!నీయధరామృతంబునం
దాపము దీర్చవే యనుచుఁ దద్దయుఁబల్కుదు సుందరీమణీ.

చ. అతులితచిత్రవస్తుసముదంచితదర్పణసూత్నకాంతి న
ప్రతిమపుఁగేళిసౌధమున బంగరుసౌధపుఁ జప్పరంపు మేల్
రతనపుఁగోళ్లమంచమున రంజిలు పూసలసెజ్జయందు నేఁ
గుతుకముమీఱ నిన్నుఁగవగూడుటయెన్నడొ సుందరీమణీ.

ఉ. ఇంచుగ నొక్కనాఁడు పడకింట సమున్నతదర్పణాప్తి నై
జాంచితమూర్తిఁగన్గొని పరాంగనలో యనియల్గి పోవ వా
రించుచు నీడఁజూచి బెదరేవని నవ్వుచు మోముద్రిప్పి వీ
క్షించుమనన్ గ్రహించి దయసేతువుగా నను సుందరీమణీ.

చ. పలుచనిమేనితోఁ జిలుకపల్కులతోఁ జిఱునవ్వమోముతో
కులుకుకడానిడాల్ పొగరుగుబ్బలతో నసియాడుకౌనుతో
బలువుపిఱుందుతోఁ దరుణపల్లవజి చ్చరణద్వయంబుతో
తలిమను చెంత నిల్చి పరితాపము దీర్పవె సుందరీమణీ!

చ. కిలకిల నవ్వ నవ్వి, గిలిగింతలు వింతలు చేసిచేసి, గు
బ్బలనెదఁ గ్రుమ్మి క్రుమ్మి, నునుపల్మొనవాతెఱనొక్కి నొక్కి, రా
చిలుకపలుమావజీరువిలసిల్లు లడాయి బడాయి చూపు నిన్
దలఁచినగుండెలో దిగులు దైవమెఱుంగును సుందరీమణీ!

చ. కొదమమిటారిచన్నుఁగవగొప్పపిఱుందుమెఱుంగుఁజెక్కులొ
ప్పిదమగు కన్ను లబ్బురపుఁబెన్నెఱులొప్పవయఃప్రపూర్ణమై
మదనునిదంతిలాగు ననుమక్కువదక్కఁ బెనంగుచుండు నిన్
వదలఁకయున్న నబ్బునహా సహవాసము సుందరీమణీ.

చ. గడియెడబాసి చిత్రఫలకంబున నానునుమాపు వ్రాసి న
ల్గడలును జూచి మోహముసఁ గన్నులనద్దుకచన్నుదోయి పై
నిడికొనిజంకుకొంకునెడ నేఁ గనుగొందు పిఱుందపొంచి బ
ల్వెడవిలుకాఁడు కత్తిఝుళిపించెను కోయను సుందరీమణీ!

చ. చనుగవమున్ను నొక్కుదునొ చక్కనిచెక్కిలిముద్దుగొందునో
మునునునుమోవిఁ గ్రోలుదునొ? తొత్తలఁగవుంగిట జేర్చుకొందునో
యనియెదురాగ మొంది మనసారగ నువ్విళులూరుచుండఁగాఁ
దనువులు రెండునొక్కటగఁదార్కొనఁజేతువె సుందరీమణీ!

ఉ. చిత్తమురంజిలంగ నలచిత్తజుపట్టపుదంతివై
వత్తువు వచ్చిచిత్రితమ?యిబ్బడినుండెదు నన్ను కేళిలో
మెత్తువొ మెచ్చి నాసొలపుమేన్ వెదదీరగమోవినానకన్
బిత్తువొ నీఋణంబు లిక యెన్నడుదీర్తును సుందరీమణీ.

ఉ. మంతనమంచువచ్చి పలుమాఱు కపోలముచుంబనంబు గా
వింతువె పువ్వుదండ మెడవేసెదనంచు నురంబునందు నా
టింతువె చన్నొ......... రదంబుమోవి సం
ధింతువె నీ వినోదము నుతింపగ శక్యమె సుందరిమణీ!

ఉ. .........వత్తు నలివేణిదయన్ ......మ్మటంచు మో
హమ్మున కౌగలించుకొన నక్కునజేర్చి .........
.........సిల్లుగతికన్నుల నశ్రులు కమ్మ.........
............దైన్యము లెంచుము సుందరీమణీ.

చ. కనకపుబొమ్మ నిన్ను కను కన్నులు కన్నులు, నీమచాతుకీ
వినయవచోగతుల్ వినెడు వీనులు వీనులు, నీతనూలతం
బెనగెడు మేనుమేను, తమి నిన్నెపుడున్ మరుకేళిలోనరం
జనమొనరించగాఁగలుగు జన్మము జన్మము సుందరీమణీ!

చ. కులుకుచుఁగేళిసౌధమునకున్ వెసనీ వరుదెంచి, నామక
న్నులువడి మూయ నే నినుగనుంగొను లాగు మోము గు
బ్బలు వళులుల్క వేసి పిరుదుపల్మరునంటుచు నీవె లాగినన్
భళిభళి ! యంచు నవ్వుమవు పక్కచుపైఁబడి సుందరీమణీ.

చ. మదనుఁడు డాసెఁబూవిలుతు మర్మములంటఁగ నేసెనక్కటా
హృదయముదూసెదానిపయినిందుఁడువెన్నెలఁగాసెఁగోకిలల్
చెదరకకూసెఁ జిల్కఁ రొదచేసె నళుల్ వడిమ్రోసె నెట్టులో
ర్చెద విధి నిన్ను న న్నెడలఁజేసె దురాత్మత సుందరీమణీ!

ఉ. హా తరళాక్షి! హా రమణి! హా చెలి! నీవును నేను మేడలోఁ
గౌతుకమందు నుఙ్ హావుసుఖానపువారము చిందమల్లికా
నూతనశయ్యపై మరువినోదములొందు మజా దలంచితే
రాతిరికంటికిన్ నిదుర రా దిక నెట్లొకొ సుందరీమణీ !

ఉ. ముద్దులగుమ్మ! నీకులుకుముద్దుమొగం బిటువంటిదంచు నే
నద్దముఁజూచుకొందు కమలాఖ్యఫలంబులు చేతనుంతు నీ
నిద్దపుఁజంటిపోలికని నీయధరోపమమంచుఁగొందు నం
చద్దయఁ దీయమామిడిరసంబొక గ్రుక్కెఁడు సుందరీమణీ.

ఉ. దీపములున్ మతాబులును దివ్వెటులుఙ్ రవియున్ శశాంకుడుఙ్
దీపితులై వెలింగినను నీమెయివెన్నెల నీ యొయారపుం
జూపుమెఱుంగు తామరల సొంపును గన్గొనకున్నఁ జిత్తవి
క్షేపమునొంది రేపగలు చీఁకటియౌఁగదె సుందరీమణీ.

ఉ. మారెడుబంటపోయగము మారెడు నీచనుగుబ్బదోయిపై
గోరెడుబంటనొక్కి మదిఁగోరెడు నీ నునుమోవిగ్రోల నో
రూరెడు నేమిసేతు మరుఁడూరట జెందకయుండు; మీఁదిహ
న్నారెడు పూవుమోదినను నారెడుబెట్టెడు సుందరీమణీ.

ఉ. భావము పల్లవింపఁ బువుబానుపుపై వసియించి వేడుకన్
నీవును నేను ముచ్చటలు నేరుపుమీరఁగ నాడుకొంచు నెం
తో వగమీర మించుతమితో నె పుకుంటిమొ యాదినంబు లిం
కేవిధి వచ్చునో తెలియదే మది కిప్పుడు సుందరీమణీ !

ఉ. కాంతుని తీవ్రబాణములకాకకుఁ దాళకలేక నీవె నే
వింతతపింపనేపయిన నింపగు కల్పనజేసె బ్రహ్మ క
ల్పాంత సహస్రకల్పనములయ్యె... లెక్కటక్కటా
యెంతనిదోర్తు...... లేను నేమియొనర్తును సుందరీమణీ.

ఉ. ఎన్నఁడునిన్ను గన్గొనుదు నెన్నఁడు కౌగిటఁజేర్చుకొందు నిం
కెన్నఁడు ముచ్చటాడిసుఖియించెద నెన్నఁడు వేడ్కమించెదన్
క్రొన్నలరారుమేడపయి క్రొన్ననవిల్తుని కేళిదేల య
భ్యున్నతలీల నే తనివినొందుట యెన్నడు? సుందరీమణీ!

ఉ. నీకటిపెంపుచేత ధరణీతలముక్ వశమయ్యె కోమలీ
నీకుచకుంభయుగ్మమున నిర్జితమయ్యె సురాలయుం బహో
చేకొనఁగల్గె నీదు జఘచే నహిధామము నిన్నుఁగూడి ము
ల్లోకము లేలినట్లు మదిలో ముదమందుదు సుందరీమణీ!

ఉ. ఓతరళాక్షి! మంచుతెరలూఁతగఁ బొక్కిలికందుకంబు నెం
తో తమి నంతరించి చెలువొందెడు నీవలిగబ్బిగుబ్బ చ
క్రాతి... ...నఖాగ్రమున రాయిడిచేసి చెలంగిడాసి చే
చేతనె పుచ్చుకొందుకద! చిత్తజుప్రాపున సుందరీమణీ.

ఉ. అంగన నన్నుఁగూడి చతురంగములాడఁగ నోరఁజూపు కో
న్నుంగవ నీటుపొంగెడు చనుంగవనీటుమెఱుంగు చక్కటిన్
సంగతినుంచు హస్తజలజాతము నీటు దలంచుకొన్న స
న్నంగజుఁ డీరుబారుగ సుమాసిని వ్రేసెడు సుందరీమణీ.

ఉ. పంతముమీఱి నీదు చనుబంతుల ప్రాపునలెక్కసేయఁగొం
డంతటికార్యమైన భవదంచితసాంద్రకటాక్ష యుక్తికే
కంతుని బాణపంక్తి నట కట్లను గట్టుదు నిదుపల్కు వి
న్నంతనె యింద్రుఁడైన గణనాయనుకొందును సుందరీమణీ.

చ. వెలదిరో! కొంతసిగ్గు విడిపిడని కాలమునందుఁ గేళి నే
చెలఁగుచుఁబూరుపాయితము చేయుమటన్న నెఱుంగనంచులోఁ
గలుకుచునున్న బాహువులు గొబ్బునఁజేకొని పైకిలాగి, చె
క్కిలిగిలిగింతగొల్పి యుబికించుటయెంతును సుందరీమణీ.

చ. చెలఁగుచు జాఫరారసపుఁ జిమ్మనగ్రోవులఁ జిమ్ములాట డా
ల్కలరతనాలమేడగదులం గడు దాఁగుడుమూతలాట వే
డ్కలఁదగు గంజిఫాట, సొగటాల్ చదరంగము లాటమున్నగా
నలరెడు నన్నిచోద్యములు నాడుదుమో తమి సుందరీమణీ.

చ. కపురపుఁ దావి గుబ్బలను గల్పగుళుచ్ఛములిచ్చి, మాటలో
నపరిమితామృతంబానఁగి యబ్బురపుఁ సురతాప్తిగూర్చిసౌ
ఖ్యపురతి సొంపుగొల్పు నిను నక్కడనే కనుఱెప్పవేయ కె
ల్లపుడును జూడకుండ నహహా! విధిచేసెను సుందరీమణీ!

చ. చిలుకకునాదుపేర విలసిల్లెడు పద్యముచెప్పుచుండ నా
యలుకుడుగాగ నూరకె విహారము చేసెడు రీతినుండఁగా
చెలియలు సైఁగలుడ్ బరిహాసించినకోపపుఁజూపుచేత బొ
మ్మలముడి యొప్పు శేష రతిమారధనుర్గతి సుందరీమణీ.

ఉ. నీజగజంపుఁ జూపులును నీచనుగుబ్బలు నీమహోరు లెం
తోజతమిూఱ నన్నును నెమర్కొనునోయన గప్పురంపు నీ
రాజనదీపిక ల్కనకరాజతకుంభము లంటిబోడియల్
రాజలుద్వారమార్గమున రాఁగను చెన్నడు సుందరీమణీ.

ఉ. హారములల్లనక్ గుచములందుఁ జరింపగవచ్చు నట్టి యొ
య్యారమునోరచూపులయొయారమునవ్వుచుఁ జెంతనిల్చునో
య్యారము శయ్యచెందెడునోయారము కేళికిఁదార్పఁగల్గు నో
య్యారము నామనమానసమునం దెడబాయదు సుందరీమణీ.

ఉ. కాంచనగంధి రాచిలుకకై వడి నీ వలదొండపండు మె
ప్పించెడు వేళ నిన్ను మరపింపఁగ నే నలచిల్కచేతఁ ది
ట్టించిన దానిపైఁ బ్రతిఘటించి తొలంగఁగజేయ దొండపం
డంచును మోవినొక్కి పరిహాసమొనర్తువు సుందరీమణీ !

ఉ. మాటలు తేనెజాలు చనుమట్టులు బంగరు బొంగరాలు కట్
తేటలు గండుమీలు సునునెమ్మొయి మించులనేలు వాహవా
కూటమినేలు మేలుగల కోపుల లీలదలంచుకొన్న హా
పూటకుఁ గోటివేలు పడిపోవుచునున్నవి సుందరీమణీ !

ఉ. హారములొత్తునంచుఁ బరిహారమొనర్చి కవుంగిలించి వ్యా
హారముదంబునన్ రతివిహారముసల్పి మనోజబాధ సం
హారముచేసి, నాదు వ్యవహారము నిల్వకయున్న నిద్ర వ్యా
హారముగాంతునే నను మహారము డందురె సుందరీమణీ!

ఉ. బోటిరొ వానచే వెడలిపోవఁగలే కొకనాఁడటుండి యే
ర్పాటుగనిద్రవోవ నెఱపయ్యెద దీపము త్రెంచివచ్చి, స
య్యాటలుమాటలున్ బెనఁకులాటలుసీత్కృతులేమిలేక నన్
గూటమి నేలుటల్ దలచుకొందువొ లేదొకొ సుందరీమణీ.

చ. అనుపమమైనవేళ సకలాభరణంబులుదాల్చి బేజుమా
లొనరిచి మానికంపు టొరనుంచిన మారుకటారివంటి నిన్
గనుఁగవనిండ నేను గనఁగా వెఱతుంగదె దృష్టి తాఁకునో
యని యికనెన్నఁడేను మనసారఁగజూచెద సుందరీమణీ!

ఉ. వేఁడిమి మానుచంద్ర! నిను వేఁడెదఁ జల్లనిరాజ వీవు నీ
వాఁడను నేనటంచు బహువారముదూరిన నీమొగంబునన్
జూడకయేఁచుచుండె జడచొప్పడ నల్లుము నీమొకొప్పుచే
వీడదె రాహువం చడలి వెల్వడుదెన్నఁడు సుందరీమణీ!

ఉ. తమ్ముల నెమ్మొగమ్ములను దళ్కుఁ జనుంగవచే నశోకగు
చ్ఛమ్ముల మావిలేఁజిగురుఁ జక్కనివాతెఱ చేతమల్లెలున్
నెమ్మొయితావిఁ గన్నుఁగవ నీటునఁ గల్వలగెల్చినావు క్రొ
త్తమ్ములెటుండివచ్చె మరుఁడా చక్రవేసెను సుందరీమణీ!

చ. నునుమునిపంటఁ గ్రొంబెదవి నొక్కియనంగుని కేళినీవు మై
పెనఁగొనినొక్కి క్రిక్కిరిసి పెక్కువనెక్కువ పిక్కటిల్లఁ జ
క్కని చనుగుబ్బలంటి బిగికౌఁగిటఁ జిక్కిననాఁడె జన్మమె
త్తినఫల మబ్బె నేమయిన దిట్టమునూ కిక సుందరీమణీ!

చ. కమలదళాక్షి నీవొకప్రకారముగాఁ బొలయల్క చేముఖా
బ్జము వెడసేయ నే నెనరుపల్కులుపల్కి, పయంటలాగి హ
స్తముగదియించిన న్వడివిదల్చి సనీత్కృతితో నురోజమ
ధ్యమముననాడు చే యిటికెవన్న హసింతువు సుందరీమణీ.

చ. నను నలనవ్వుటాలకయినఁ బొలయల్కల జేసియైననున్
నను గలలోననైనను క్షణం బెడబాయక జాలవంచు నో
వనజదళాక్షి నీకొఱకె వంతలనొందెద వెట్టులోర్తు వే
నును చలిగాలివేడికి మనోజునిదాఁడికి సుందరీమణీ!

ఉ. నీకడకంటిచే హరిణి నీకనుసైఁగలఁ జిత్రరేఖయుఁ
నీకళచేత హేమగతి నీ లలితోరులకాంతి రంభ నీ
శ్రీకరబాలలీల శశిరేఖయు నీరస వృత్తిఁ జెందుటఁ
నీకెనరారు దేవతరుణీమణులయ్యును సుందరీమణీ!

ఉ. భామిని నిన్నరే నిదుర పట్టక పట్టక పట్టినంతలో
కాముని కేళిలో మనము కౌతుకమంది పెనంగులాడి యే
మేమొ వినోదముల్ సలుప, నెక్కడిపాపపుకోడి కూసెనో
స్వామికటాక్ష మట్లలరె స్వప్నమునందును, సుందరీమణీ!

చ. నెల పయనం బటన్నవిని నీవడలొందుదువంచు నింతలో
నెలతరొ వత్తునంచు వెస నిన్నొకసమ్మతి చేసివచ్చి క్రొ
న్నెలలకు వేఁడివెన్నెలకు నిద్దపుఁ బూవిలుకాని కాఱు చి
న్నెలలకుఁ దాళలే నయితి నీవెటులోర్తువె సుందరీమణీ!

ఉ. నీజటపై జవాదిపస నిద్దపునెమ్మెయిఁ గుల్కుదావకో
రోజమృగీమదాంకితపు ఱొమ్ముదుడై తగనీదుకన్నులక్ష
రాజిలు కాటుకంటు నధరంబు వెలింగెడు నన్నుఁజూచి యా
లీజనులెల్ల నవ్వ, దరిలేని ముదంబగు సుందరీమణీ!

చ. అలరులశయ్యఁ బండి, మనమవ్వలిమోములు చేసి యల్కచే
పలుకకయుండియుండొరులఁబల్మరుచూడకయుండఁజూచుచో
నెలమి నొకింతసేపటికి నిద్దఁచూపులుఁ దారసిల్లినన్
కిలకిలనేకవుంగిళులఁ గేరుచునుందువు సుందరీమణీ !

ఉ. వింతగ నన్ను నీవు బదివేలవిధంబుల నవ్వులాట కొ
ట్టింతువు మాటల న్నెదఘటింతువు చన్గవ యల్కసేయ న
వ్వింతువు పల్కుఁగప్పురపు వీడెమొసంగి మనోజరాజ్యమే
లింతువు నీగతుల్ పొగడలేముగదే మది సుందరీమణీ !

చ. తొలఁగక చెంతనున్న ననుఁ దొంగిలిరెప్పలఁ జూచిచూడన
ట్టులు వగగుల్కియుండెదుఁగదుక్షబయనం బరుగంగ వేఁగి వి
చ్చలవిడి సౌధవీథపయి చాయలఁజూచెద వోరగంటనే
పొలమునవెల్లు నీబెళుకుఁబొంకపుఁజూపులు సుందరీమణీ

చ. నను నెడబాసియుండిన దినంబులలెక్కలఁ గొంతసేపు, నా
మునుపటికేళిలో మెలఁగి ముచ్చటలాడుట కొంతసేపు, నా
కనుగుణమైనవస్తువుల నంపెను సందడిఁ గొంతసేపు, నో
య్యన పవలెల్ల నోర్చి నిశియం దెటులోర్తువొ సుందరీమణీ!

చ. పెనిమిటి కాంచ లేఁడనియుఁ బిల్చినఁ బల్కవటంచుఁ దోడి జ
వ్వను లెకసక్కెమాడ నొకవైఖరిఁబల్కుచు నొంటి బాగులే
దని వెత నిద్రయోగిరమునందక కుందుచు నూపిరెల్ల ము
క్కుననిడియుంటివంచు విని గుండెలు నిల్వవు సుందరీమణీ!

చ. రతి మును గెలిసోలి నడురాతిరి మేల్కని నేను నిక్కబునా
రతమతిఁ గౌఁగిలించినఁ బిరాలున నవ్వలికేఁగి రాక య
ద్భుతపడి నేను బిల్వ విని ప్రొద్దిక నెంతని పల్కి సిగ్గుతో
ఋతుమతివౌట తెల్పకయె యేర్పడఁదెల్పుదు సుందరీమణీ!

చ. పటుగతిఁ బూవుబంతి చనుబంతులపై గురిచేసి వ్రేయగా
తటుకున నొడ్డి పుచ్చుకొని తక్కుచు నీపనికేమి తాళుమం
చిటునటు చూచిచూచి వలయింపుచు నవ్వుచు మూఁడునాళ్లు ము
చ్చటలనె తెల్లవాఱఁ బలుసందడి నుందువు సుందరీమణీ.

చ. గొదగొని మోవులానుచును గొంకక నేఁ బయికొందునంచు మైఁ
బొదలి పెనంగులాడి చలమొంది వచించఁగరాని చేష్టలన్
మదనుని కేళిలో మెలఁగు నాలవనాఁటిగతుల్ తలంచితే
హృదయము జల్లుజల్లుమను నెంతని యోర్చెద సుందరీమణీ.

ఉ. ఏగతినోర్తునే జలరుహేక్షణ! నే క్షణమైనఁ బాయగా
లేఁగదవే సువర్ణకదళీసదళీనకరోరుయుగ్మ యు
య్యోగురిదప్పకుండ మరుఁడుల్లము జల్లెడతూంట్లు చేసెనే
యోగజయాంగ! యోరమణి! యోజగదద్భుతసుందరీమణీ.

ఉ. కన్నియ యిప్పుడేల కడకట్టప్రయాణము దీర్చివచ్చి నిన్
గన్నులఁజూచి సంకసిలఁగల్గెడు పోఁడిమిపట్టినంతలో
నెన్నిదినంబు లుంటివని యెంతయుఁ గోపముమాని బిగ్గఁగన్
నన్నుఁ గవుంగలించుకొని నావెత దీర్పవె సుందరీమణీ!

చ. కురులకుఁ గృష్ణభావము కుచ్చల కచ్యుతరీతి కర్ణపై
ఖురికల శ్రీవరప్రతిభ కౌనునకున్ హరిమంగళాకృతుల్
కరముఁజెలంగునీకు; కలకాలము నిన్ను దలంచఁ బాయు దు
ష్కరపరితాపమెల్ల నవసారసలోచన సుందరీమణీ!

చ. అలికులవేణి నీకొరకు నన్నలఁ దమ్ములఁ బాసి వస్తి నీ
కులుకుమిటారిగబ్బిచనుగుబ్బల నొత్తుచుఁ గౌఁగిలించవే
కలికిరొ నీకు గుండె బలుకట్టిఁడి దైవము రాయిచేసెనే
చెలియరొ నీకు నాయుసురు చెందకమానునె సుందరీమణీ!

తేవదనస్య చంద్రరుచి ధిక్కరణ ప్రతిభాస్తు; తేదృశో
ర్భావభవోత్పలాంబురుహ బాణకదంబజయోస్తు సంతతం
తేవచనస్యకోకిలతతి ప్రవరాయసకృద్విధోస్తుతం
చేవినుతింతునీకు శుభమీయఁగ దేవుని సుందరీమణీ!

సంపూర్ణము.

---

మందార తరుసూనమాల్యము ల్గొని యింద్రుఁ
డే తెంచె నిందుల కేమియాజ్ఞ
గంధర్వకిన్నరు ల్కరగతవీణులై
తడవాయె వచ్చిరి దర్శనేచ్ఛ

గీ. ననుచు జయవిజయులు దెల్ప హాయియనుచు
నిందిరను గూడియుంటివి వింటికన్న
గుడి పదిలమంచు యవనుల గొట్టవయ్య
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ

సీ. చటులసోమకహార స్ఫుటతరాటోపంబు
కుంభినీభరణ విజృంభణంబు
ఖలహిరణ్యాక్ష శిక్షణరూక్షదక్షత
క్షుభిత హిరణ్యరక్షోభిదాత్మ
బలిమహావైభవ భంజనమహిమంబు
నుర్వీశ గర్వాంతకోర్వతిశయ
మతిదుష్టదశకంఠహరణ బాహుశక్తి
ప్రబల ప్రలంబ దారణవిధంబు

గీ. పురవధూవ్రతభంగ విస్ఫురణసరణి
భువనములఁ బ్రోవగావించి జవనయవన
సేన నణఁచుట కిటుజాగు సేయఁదగునె
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

మందార తరుసూనమాల్యము ల్గొని యిం(డుఁ
డే తెంచె నిందుల కేమియాజ్ఞ
గంధర్వకిన్నరు ల్కరగతవీణులై
తడవాయె వచ్చిరి దర్శనేచ్ఛ

గీ. ననుచు జయవిజయులుదెల్ప హాయియనుచుఁ
నిందిరను గూడియుంటివీ వింటికన్న
గుడి పదిలమంచు యవనుల గొట్టవయ్య
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ

సీ. చటులసోమకహర స్ఫుటతరాటోపంబు
కుంభినీభరణ విజృంభణంబు
ఖలహిరణ్యాక్ష శిక్షణరూక్షదక్షత
క్షుభిత హిరణ్యరక్షోభిదాత్మ
బలిమహావైభవ భంజనమహిమంబు
నుర్వీశ గర్వాంతకోర్వతిశయ
మతిదుష్టదశకంఠహరణ బాహాశక్తి
ప్రబల ప్రలంబ దారణవిధంబు

గీ. పురవధూవ్రతభంగ విస్ఫురణసగణి
భువనములఁ బ్రోవగావించి జవనయవన
సేన నణఁచుట కిటుజాగు సేయఁదగునె
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !!

సీ. మొరవోయెనో వక్రముఖనక్రహార మ
హా సంపర్కనిర్వక్రచక్రధార
వాసిదప్పెనొ హత్తోద్భాసిసుమాలి మ
హాసురశార్ఙ్గబాణాసనంబు
పదునువాసెనొ మధుప్రముఖేంద్రరిపురాజ
బృందాంతకారక నందకంబు
కడిమి జప్పెనొ స్తంభకమధప్రథవిధాన
చండమై దగుగదాదండపటిమ

గీ. జబ్బుపడియుంటివేల మాయబ్బయొక్క
దెబ్బతియ్యక తురకలయుబ్బు చెడదు
గొబ్బునఁ జెలంగు మిఁకనైన నిబ్బరముగ
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ

సీ. చుట్టబెట్టిరి మహారట్టజంబులతోడ
నిఖలరాజ్యము పఠానీలపౌజు
మట్టిమల్లాడిరి మదసామజంబుల
పురజనపదములు తురకబలము
కొట్టి కొల్లలువట్టె గురువిప్రమానినీ
ఘనగోగణంబుల ఖానుసమితి
పట్టిపల్లార్చిరి బహుదుర్గవర్గముల్
సరభసోద్ధత్య పాశ్చాత్యచయము

గీ. మించి భూస్థలి యిటులాక్రమించి రాఁగ
నలుక రాదేమి నగరివారలను దోఁచ
పొంచియుంటివి యవనుల ద్రుంచు మిఁకను
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!

సీ. మొఁగిసి రక్కసుని బొందుగఁజించు నీగోళ్లు
చిటిలెనో సిరికుచశిఖరిఁ దాకి
యరులపై భగభగలాడు కోపజ్వాల
లారెనో శ్రీకటాక్షామృతమున
పరవీరగర్భము ల్పగిలించు బొబ్బవ
ల్కదో రమానంద గద్గదికచేత
ఖలుల దండింపగాఁ గఠినమౌ నీగుండె
కరగెనో శ్రీలక్ష్మి సరసకేళి

గీ. నహహా! నీ భీకరోద్వృత్తి నల్పులనక
యవన రాజుల నడఁచివేయంగవలయుఁ
జిన్నపామునకైనను బెద్దదెబ్బ
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!

సీ. పొదలలో డాఁగెనో పొట్నూరులోనున్న
రమణీయకోదండ రామమూర్తి
యెక్కడికేగెనో యెరుగంగరాదుగా
పటుభీమసింగి గోపాలమూర్తి

సాధ్వసోద్వృత్తి నెచ్చటికేగియుండెనో
జామిజనార్దన స్వామిమూర్తి
యెన్నిపాట్లను బడుచున్నాఁడో చోడవ
రంబులోఁ గేశవరాజమూర్తి

గీ. నిబిడ యవనుల భయశంక నీవు నింక
పరుల కగపడకుండుమీ పక్కనున్న
గాయమిప్పటికిని మానదాయె నయయొ!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ

సీ. పాశ్చాత్యుల సమాజుపై బుద్ధిపుట్టెనో
మానులజపముపై మనసురోసి
యవనుల కందూరి యందిచ్చ చెందెనో
విప్రయజ్ఞములపై విసుపుపుట్టి
ఖానుజాతి సలాముపై నింపుపుట్టెనో
దేవతాప్రణతిపై భావమెడలి
తురకల యీదునందు ముదంబుగల్గెనో
భక్తనిత్యోత్సవపరతమాని

గీ. వాండ్రు దుర్మార్గులయ్యయో వ్రతముచెడ్డ
సుఖము దక్కదు వడిఢిల్లి చేరఁగఁదోలు
పారసీకాధిపులఁ బటాపంచలుగను
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. నీకొండపై నెక్కి నియతులౌభక్తులఁ
గొట్టి నానావస్థఁబెట్టకుండ
గంగాధరాతీర కలితమంటపముల
మద్యపానముచేసి మలయకుండ
నీవంటశాలలో నిశ్శంకతో మాంస
ఖండము ల్మెండుగా వండకుండ
నీగుడిఁజొచ్చి దుర్నీతిఁ గామాంధులై
పరవధూటుల భంగపఱచకుండఁ

గీ. బౌరుషంబునఁ దురకలఁ బాఱఁదరుము
వేఁటకాఁ డిల మెత్తనౌవేళ లేడి
మూఁడుకాళ్ళను నడుచు నిర్మూలితాంహ
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. సెలవైన భైరవుం డలుకచే వైరుల
నెత్తి బల్లదచేత మొత్తలేఁడె
యాజ్ఞయిచ్చిన వీరహనుమంతుఁ డహితుల
ఘనవాలమున నేలఁ గలుపలేఁడె
యంపించితే త్రిపురాంతకుం డరిసేన
ఘోరశూలమ్మున గ్రుమ్మలేఁడె
కనుసన్నఁజేసిన వినతాతనూజుండు
విమతుల నెగిరిపో విసరలేఁడె

గీ. యింతతాలిమి చేయుదే యిప్పటికిని
మట్టుకొనివచ్చె శత్రుసమాజమెల్ల
ప్రజలరక్షింపు యవనేశుబలముగూల్చి
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. యవనేశుధాటికి నడలి సర్వస్వమ్ము
విడిచి మందిరములు వెడలువారు
వెడలియుఁదలదాచ వెరవేమిగానక
నడవుల నిడుమలఁ బడెడువారుఁ
బడియు నెచ్చటఁగూడుఁ బట్టగానక తమ
శిశువులతో వెతఁ జెందువారుఁ
జెందిడెందముగుంద గాందిశీకత నభి
మానార్థులై ఖేదమందువారు

గీ. నైరి యొక్కొక్క భార్యతో నవనిఁబ్రజలు
అష్టమహిషులపైఁ బదియారువేల
సతులతో నీవు వలస కెచ్చటికరిగెదు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. దర్పణాకృతిఁ దళత్తళలాడు కంబాలు
డంబై చెలంగుబేడాహారంగు
చెప్పఁజూపఁగరాని యొప్పైన నుప్పరం
బప్పళించెడు వంక కొప్పుచొప్పు

చిత్రవిచిత్రమౌ చిత్రంపుబొమ్మల
గులుకు చక్కనిగుళ్ళు గోపురములు
నమృతోపమానమై యలరారుగాంగధా
రాముఖ్య సకల ధారా జలంబు

గీ. నెంతముచ్చటపడి సృజియించినావొ
యిల్లు చెడగొట్టుకొనకు నన్నేలినయ్య
ఘనతురుష్కులఁ బడఁగొట్ట మనసుబెట్టు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ

సీ. యవనధాటికి భయమందితివో కాఁబోలు
నక్కజంబుగఁగొండ నెక్కినావు
ఖానులకడలియే కాఁబోలు సంపూర్ణ
పౌరుషంబునఁ గత్తిఁబట్టవైతి
వఖిలపాశ్చాత్యుల నలమలేకయపోలు
తాపసిగతి జడ దాల్చినావు
మ్లేచ్ఛనాయక బలాలికి జంకికాఁబోలు
మిక్కిలి గంధంబు మెత్తినావు

గీ. గట్టిగా నీవు తురకలు ముట్టకుండ
నవవరాహాకృతి ధరించినావు సామి
వలదు నిందలఁ బడ, దురష్కులవధింపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. పటుతర స్తంభంబు పటపటబద్దలు
గా జనించిన నీ యఖండమహిమ
చటులతరంబుగాఁ బెటపెటదంష్ట్రలు
కొరుకుచువచ్చు నీ ఘోరవృత్తి
స్ఫుటతరోద్భటవృత్తి జిటచిటధ్వనిమీఱు
నీనిటలాక్షు వహ్నిక్రమంబు
కుటిలనఖంబుల సొటసొట నెత్తురు
జింద రక్కసి రొమ్ము జించు కినుక

గీ. యెందుఁబోయెనో నేఁడు మహీజనంబు
గుంద నౌద్ధత్యమునవచ్చు ఘోరయవన
బృందములయందుఁజూపు తద్భీకరగతి
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. నట్టువల్ద్రొక్కఁగా నవయామునీయకూ
లంబుగాదు రణస్థలంబుగాని
కొట్టితోలగ నీకు గోవృషభంబుల
బాజుగాదు గుఱ్ఱాల పౌఁజుగాని
పట్టిచూడఁగ నీకు పసిగాపుచెలుల పా
లిండ్లుగావు ఫిరంగిగుండ్లుగాని
ముట్టిముక్కలుసేయ ముదిసిన యర్జున
తరులుగా వరివీర తరులుగాని

గీ. యవనబలములతోడఁ బోట్లాడలేవు
శూరుఁడౌ జరాసంధుండు చుట్టుకొనిన
నాఁటితీరయ్యె మేల్నీకు నవ్వుగాదు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. కాంతలఁ జెరబట్టఁ గనుగొనుచుంటివి
పాంచాలి వెత యెట్లు బాపినావొ
గోవధసేయ గన్గొనుచుంటి విప్పుడు
కరుణతోఁ గరినెట్లు కాచినావొ
ద్విజులు బాధలుపడఁ దిలకించుచుంటివి
భువిఁ గుచేలుని నెట్లు బ్రోచినావొ
సత్ప్రభురాజ్యనాశన మొందఁగంటివి
ధ్రువుని కెట్లిచ్చితో దొడ్డపదవి

గీ. దుష్టశిక్షణ మొనరించి శిష్టరక్ష
జేయకుండినఁ బూర్వప్రసిద్ధి జెడును
నార్తరక్షణ బిరుదంబు హానిజెందు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ.

సీ. సముదగ్రమగు సముద్రముఁ జొచ్చి యీఁదుటో
కొండ నెత్తిని బెట్టుకొంట యొక్కొ
ధారుణీస్థలిఁ ద్రవ్వి తలనెత్తుకొంటయో
గొబ్బున సింగంపు బొబ్బయిడుటొ

యడుగిడి త్రైలోక్య మాక్రమించుటయొకొ
వేయిచేతుల పాని వేయుటకొకొ
యొకశరాగ్రమ్మున నుదధి నింకించుటో
కరిపురంబెల్ల బెగల్చుటొకొ

కరుణ జగములఁ బ్రోచుటో తురగమెక్కి
ఘనరిపులఁగొట్టుటో తురష్కవధయెంత
కొండమెక్కెదు బ్రతిమాలుకొనినకాలఁది
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. కురుపాలు బ్రొద్దునఁ గ్రోలక నొకక్షణ
మైనఁ దాళవుగదా యాకటికిని
బాగుగా మెయి మలాకీగంధమలఁదక
యింపుపుట్టదుగదా యెప్పటికిని
తనువునిండఁగ ధగద్ధగిత పట్టాంబరం
బవధరింపక మాన వహరహంబు
నాటపాటలు మొదలగు వినోదంబుల
నుబుసుపుచ్చకకాని యుండలేవు

గీ. భక్తులెల్లను దుర్మార్గపరతురష్క
రాజిచే నొందిరిదె పడరానిపాట్లు
భోగరాగంబు లేక నీకు బొసఁగుటెట్లు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. పుట్టినప్పుడు పీకఁబోకార్చితివి భళీ
పూతనాఖ్యోపేత యాతుధాని
పుడమిపైఁ గడు తప్పు టడుగిడునప్పుడు
బండిరక్కసు మేను చెండినావు
ఆటప్రాయమున దృణావర్త బకధేను
కాది దైత్యకులంబు నణఁచినావు
యౌవనంబున నృశంసావతంసక కంస
విధ్వంసనరిరంస వెలసినావు

గీ. భూసురులఁ బ్రోవవేమి మహాసురారి
యిప్పు డేటికిఁ ద్రుంప వే ళ్లెగసనైన
బుద్ధిడిగినన వచ్చెనో హో! మరేమి
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. ఎలమితో సోమయాజుల పెద్దర్ఘూరీలు
గుడిగుడీలుగఁ జేసి కొనెడువారు
యజ్ఞవాటికలలో నగ్నిహోత్రంబుల
ధూమపానము చేసి త్రుళ్లువారు
యాగపాత్రలు దెచ్చి హాసుగా వడి లుడి
కీచిప్పలుగ జేసి కేరువారు
స్రుక్స్రువముఖ్యదారు మయోపకరణము
ల్గోని వంటపొయి నిడుకొనెడివారు.

గీ. నగుచు యవనులు విప్రులఁ దెగడుచుండ
సవనభోక్తవు నీవెట్లు సైఁపఁదగునె
దినదినఁగ గాసిలైనను గనవువేయు
వైరిహారరంహ! సింహాద్రి నారసింహ !

సీ. చింకికుళ్లాయైన శిరమున దాలిచి
దివ్యకిరీటంబు దీసిదాచు
వనమాలికయొచాలు వక్షంబున ధరింపఁ
గౌస్తుభరత్నంబు గట్టిసేయు
పూడకుండగచెవి పుడకైన నిడుకొని
మకరకుండలములు మాటుసేయు
కటిధగద్ధగితమౌ కనకచేలంబేల
మొలచుట్టు మొకపాటి ములకగుడ్డ

గీ. దొడ్డసరుకులు తురకలు దోచుకొనిన
కష్టమౌ కానివేళ జగత్కుటింబి
వీవు వేషంబుచెడిన నీకెట్లుగడచు
వైరిహారరంహ! సింహాద్రి నారసింహ

సీ. నామొరాలింపవు నారదగానంబు
వినుచుంటివో వేడ్క వీనులలరఁ
గరుణజూడవుమమ్ముఁ గమలామహాదేవి
కన్నులుమూసెనో కౌతుకమున

మముఁబ్రోవ రావేమి కమలభవాదులు
భక్తితోఁ బాదముల్ పట్టుకొనిరొ
యాదరకలన మాటాడవు భూనీల
లలరఁగా ముచ్చటలాడుమండ్రొ

గీ. యిట్టులున్న ననాథుల కేదిదిక్కు
సమయమా? యిది కేళికాసౌఖ్యమునకు
దుష్టుల వధించి ప్రోవు సాధువుల నెల్ల
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!

సీ. పాలియ్యవచ్చిన పూతనప్రాణంబు
లపహరించి చెలంగినట్లుగాదు
యాగోత్సవంబున నతిమోదమునఁబిల్వ
నపుడు మామను ద్రుంచినట్లుగాదు
చేతగా కొక నరుచేత చుట్టంబుల
నందరి జంపించినట్లుగాదు
తుంగకల్పించి యుత్తుంగవంశద్రోహ
మాచరించి చెలంగునట్లుగాదు

గీ. పరబలంబది నీప్రజ్ఞ పనికిరాదు
లెమ్మిఁకను మీనమేషము లెక్కయిడక
చోరవతురకలు గొట్టఁగాఁ జుక్కలెదురె
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!

సీ. అవని మూఁడడుగు లిమ్మని వేడవచ్చిన
బలి నణంచినదేమి ప్రాభవంబు
ఇనకుమారునిమది కిచ్చకంబుగఁ బొంచి
వాలినిజంపు టే విలుసీకుఁ
గడుఁగాలయవనున కడలి యాముచుకుంను
పాలి కేతెంచు టే పౌరుషంబు
భువిజరాసంధుతోఁ బోట్లాడఁగాలేక
ద్వారకఁజేరు టే ధైర్యవృత్తి

గీ. యౌర నిజమాడ నిష్ఠురంబౌనటంద్రు
గాక రోషంబు గలిగిన కఠినయవన
సేన నిర్జించి యీయాంధ్రసృష్టినిలుపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ

సీ. నీరుహాలుకావ పకడో రెగద్దాయని యా
హితాగ్నుల నెత్తు లణచకుండ
పాముఖో నేకు తుంపానిలారేయని
తివిరిశ్రోత్రియుల మర్దింపకుండ
ఘాసులారే అరే గాండూయనుచు శిష్ట
తతులపైఁబడి బిట్టు తన్నకుండ
కులితీపకావురే జలిదీయటంచు మా
ధ్వులమెడ వడిఁబట్టి త్రొయ్యకుండ

గీ. బహుళహాలామదావిల పరుషయవన
రాజి నిర్జింప నీవంటి ప్రభువుగల్గ
బ్రాహ్మణుల కిన్నిపాట్లు రాగాదగాదె
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. అగ్రజపీడితుండైన విభీషణు
శీఘ్రముం దయజూచినావుగావొ
అలమున భీతుఁడౌ నంబరీషుని యార్తి
నాదంబు మున్ను విన్నావు గావొ
బహుబాధితుండైన ప్రహ్లాదునకును ము
న్నీవు ప్రత్యక్షమైనావు గావొ
ధ్రువముఖ్యులైన భక్తులనెల్ల మున్ను సం
తసమున రక్షించినావుగావొ

గీ. నాఁటి మది లేదొ? కరుణ నన్గనవు వినవు
రావు ప్రోవవు వేగ పురాణపురుష
తాతతాతవు ముదిమదితప్పినావు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. గ్రామంబులన్నియుఁగాల్చి దీపారాధ
నలు చేసిరౌర! యానందముగను
వడిసాధుజనుల సర్వస్వముఁగొని శఠ
గోపంబు బెట్టిరి గురుతరముగఁ

బటఘటాదులపోవ బ్రతిమాలి వారికే
మియ్యక ఘంటవాయించి రహాహా!
పెద్దలకడ దుడ్డుపెట్టి ప్రసాదంబు
వడ్డించి తగపరాభవము చేసి

గీ. రవ్వర! యవనార్చకులు నీకు నాప్తులైరి
భూసురులు చేయుపూజలు పొసగవొక్కొ?
యకట! యిదియేమి పాపమునకు వెరవవు
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!

సీ. వాసవు పిడుగులవానకు వెరవవు
కడు ఫిరంగీగుండ్ల కడలనేల
వెరవవు భీష్మాదిభీష్మబాణాళికి
బాణాలకేటికి భయపడంగ
దవవహ్ని దిగమ్రింగితివిగాని జంకవు
భయమేల యీయరబ్బులకు నీవు
గణియింప కధికరాక్షసుల శిక్షించితే
మ్లేచ్ఛులనణచు టేలెక్క నీకు

గీ. నీ కలిమి నీ వెఱుంగవుగాక లోక
కర్తవగు నీకొక యసాధ్య కార్యమేది?
పామరులు నవ్వకుండగఁ బరులఁదరుము
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!

గీ. రాఁగనోపవా ? పాశ్చాత్యరాజ్యలంబు
సాధుతతిఁ గొట్టిదోఁచఁగాఁ జకితులయిరి
తుది పనికివచ్చెలే నీకు తురకగుద్దు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. తపనీయకశిపుండు దండించుతరువాత
కాని ప్రహ్లాదుని గానలేదు
కురురాజు పాంచాలి కొప్పుపట్టీడిపిం
చిన వెన్కఁగాని రక్షింపలేదు
కరిరాజు మొసలి చేఁ గడుకష్టపడిన
పిమ్మట గాని వేంచేసి మనుపలేదు
పాండవుల్బాధలఁ బడిన యనంతరం
బునగాని సిరులిచ్చి ప్రోవలేదు

గీ. భక్తులిప్పుడు కొన్ని యాపదలఁబడక
ముందుఁ బోషింపనట్లయాఁ గొందఱికిని
మును శిశువు నేడిపింపక ముద్దురాదు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. జడవిప్పి జనపాలు సవరింపు మిరువంక
బలు కిటికిరీటీరాల పాగజుట్టు
బొట్టునెన్నుదుటిపై బొత్తిగాదిద్దుముకో
పోగులూడ్చుము చెవులూడవిడువు

గీ. రాఁగనోపవా ? పాశ్చాత్యరాష్ట్రలంబు
సాధుతతిఁ గొట్టిదోఁచఁగాఁ జకితులయిరి
తుది పనికివచ్చెలే నీకు తురకగుద్దు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. తపనీయకశిపుండు దండించుతరువాత
కాని ప్రహ్లాదుని గానలేదు
కురురాజు పాంచాలి కొప్పుపట్టీడిపిం
చిన వెన్కఁగాని రక్షింపలేదు
కరిరాజు మొసలి చేఁ గడుకష్టపడిన
పిమ్మట గాని వేంచేసి మనుపలేదు
పాండవుల్బాధలఁ బడిన యనంతరం
బునగాని సిరులిచ్చి ప్రోవలేదు

గీ. భక్తులిప్పుడు కొన్ని యాపదలఁబడక
ముందుఁ బోషింపనట్లుయాఁ గొందఱికిని
మును శిశువు నేడిపింపక ముద్దురాదు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. జడవిప్పి జనపాలు సవరింపు మిరువంక
బలు కిటికిరీటీరాల పాగజుట్టు
బొట్టునెన్నుదుటిపై బొత్తిగాదుడుచుకో
పోఁగులూడ్పుము చెవులూప్పడవిడువు

వడిగనంగీయిజార్డొడుగు దట్టీజుట్టు
కైజారుదోపు డాల్కత్తిఁబట్టు
బీబినాంచారిని బిలుపింపువేగమే
తుదకభ్యసింపుమీ తురకభాష

గీ. శక్తిలేకున్న నిట్టివేషంబుపూను
మన్న సరి! లోకవంద్యుఁడవయిననీవె
నీచులకును సలామ్ సేయ నే సహింప
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. గోవర్ధననగంబు గొడుగుగాఁబట్టిన
నాఁడు కేలుననొప్పి నాటెనొక్కొ
సరిదెబ్బలాడుచో జాంబవంతునిగుద్దు
కోరెక్క లో గుంట్లుపారెనొక్కొ
నరుని సారథివైననాఁడు భీష్మునిచేతి
కలికుటమ్ములు రొమ్మునగవి సెనొక్కొ
దుఃగ్గనబోయని తూపునాటినపక్క
గాయమిప్పటికి బోదాయెనొక్కొ

గీ. యక్కట యవనరాజ్యేనఁ జక్కజేసి
యుక్కణఁప వెంను చేత నీవోపలేవు
పేదపుండెల్ల బయలను బెట్టవలయు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. కనిపించుకోవుగా ఖలులుమార్గస్థుల
కొంకకముక్కులు గోయునపుడు
ఆలకింపవుగదా యయ్యయో! ప్రజఘోష
ధూర్తులు వడినిళ్ళు దోచునపుడు
జాలిగొందా వెగా చటులతురుష్కులు
భామినులను జెర ల్బట్టునపుడు
అలుకలేదా వెగా యవనులు సత్ప్రభు
వసుమతిమట్టుకో వచ్చునపుడు

గీ. మంకుతనమేమి? మాతండ్రి! మరచినాఁడ
మానునే గొల్లపాల్ద్రావ మందబుద్ధి
దేవకీదేవిపాల్ద్రావ తెలివిరాదె
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. అల విప్రభార్యయా నదితిపాల్ద్రావుట
బలి యాచనావృత్తి పాదుకొనివె
క్షత్రియకన్యయా కౌసల్యబాల్ద్రావ
రావణాదులద్రుంచి ప్రబలినావు
గొల్లయానందుని కులసతి పాల్ద్రావ
పశులగాచెడిబుద్ధి పట్టువడినె
నిసుమంత విసపురక్కసిపాలు చవిచూడఁ
గాఁబోలు మాపట్ల కఠినవృత్తి

గీ. పాలకాగ్రణివైన గోపాలబాల !
పాలబుద్ధులుమాని మాపాలఁ గలిగి
పాలనమొనర్చవయ్య ! కృపాలవాల
వైరిహరరంహ ! సింహాద్రి నారసింహ !

సీ. బేగీ అరేఅరబ్బీ పడోరేయని
బోడిసన్యాసుల బోడచువారు
మత్రఖోమూపరుమాటీయుచు వైష్ణవుల
బొట్లుదుడుపఁగఁ బోవువారు
పత్థగుకాయకు బందియూరేచోడ్
దేవని శైవులఁ దిట్టువారు
కాలటీకాతూనికా ద్దేవటంచు మా
ధ్వుల ప్రల్లదమ్మాడి త్రోయువారు

గీ. నైరియవనులు మిమ్ము నిట్లడలఁజేయ
నట్టివాండ్రకు ద్విజులెంత యూఁగద గుడి
మ్రింగువానికి లింగమూర్బిండివడెము
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. విషవహ్ని బ్రజకెల్ల వెతఁజేయు కాళీయు
పడగలు వడిద్రొక్కు పటిమ యేది
వడిగ బిడౌజుండు పిడుగులు వర్షింప
శైలమెత్తిన నాఁటి శక్తి యేది

దుర్యోధనాదులు దొరకించుకొనువేళ
విశ్వరూపము సూపు వింత యేది
ముర నరకాది ముష్కరదుష్కరాదుల
మర్దించి చెలఁగు నీ మహిమ యేది

గీ. యిట్టి ఖలు లేచ దీనుల నెన్నఁటికిని
కరుణజూచెదొ? కలవాఁడు గాదెదీయు
దనుక బీదలప్రాణముల్ తొళుకెట్లు
వైరిహారరంహా! సింహాద్రి నారసింహా !

సీ. ఆభీరగృహముల నారగాగినపాల
మీఁగడల్వడి దిగమ్రింగఁగలవు
తల్లియిచ్చినచల్ది తగ్గబ్రహ్మవచ్చిన
వెనుకజూడక వేగ విసరఁగలవు
రాధికామధురాధరామృతధారలు
గుటుకుగుటుక్కునఁ గ్రోలఁగలవు
భక్తులెల్లను తిరుపణ్యారములొసంగఁ
జెలఁగి లోలోన భక్షింపగలవు

గీ. గాని యవనులపై వడిబూనలేవు
కబళమన నోరు దెరతువు కళ్లెమన్న
మోముద్రిప్పు హయగ్రీవమూర్తి వహహ
వైరిహారరంహా! సింహాద్రి నారసింహా !

సీ. అల విభీషణుపల్కు లాదరించినవాఁడె
యతిదుష్టుఁడౌ రావణాసురుండు
వసుదేవముఖ్యుల వరబోధ వినియెనే
దుండగీఁడైన కంసుండు నాఁడు
విదురాదిబుధులఁ వివేకముల్దెలిసెనే
క్రోధాత్ముఁడైన దుర్యోధనుండు
భీష్మాదు లెంతసెప్పిన నిచ్ఛగించెనే
బాలిశుఁడగు శిశుపాలకుండు

గీ. గొట్టకుండఁగ ధూర్తుల వట్టిశాంతి
తాలిమేటికిఁ దురకలు తఱిమిరాఁగ
నోదిగిచూచెదు కలిబోయ నుట్లదిక్కు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ

సీ. నిదురించినావొ నిర్నిద్రభద్రాకార!
కలితభోగీంద్ర భోగంబుమీఁద
శయనించినావొ శైశవమూర్తితోఁ బయః
పాథోధిపటువటపత్రసీమఁ
బవళించినావొ శ్రీభామినీదోర్మూల
కూలంకష స్తన కుంభయుగళిఁ
బడకగావించితో భక్తసమ్రాణ్మాన
స్సంకల్పితానల్పశయ్యయందు

గీ. నిబిడపాశ్చాత్యభీతులై నిఖిలజనులు
కదసి మొరవెట్ట నీకెట్లు నిదురపట్టె?
లెమ్ము నాసామి! జాగేమి! చిమ్ము రిపుల
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా !

సీ. నినుఁ బూజగావింప ఘనవిప్రు లేటికి
కొదువగాకుండ సయ్యదులె కలరు
వినుతింప శాస్త్రజ్ఞ విద్వాంసు లేటికి
పీలుగా మించు మౌల్వీలె కలరు
ఆత్మకీర్తనసేయ హరిభక్తు లేటికిఁ
గేకలువేయ ఫకీర్లు కలరు
పూతాత్ములగు ననుష్ఠాతలు నీకేల
తలచుగా పీరుజాదాలె కలరు

గీ. వట్టియాశల నిటు మొడవట్టి త్రోయఁ
జూరువట్టుక వ్రేలాడినార మిట్టి
ముచ్చటకె నీవు పశ్చిమముఖుఁడ వౌట
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా !

సీ. జయవిజయీభవ జగదవనాసక్త
జయవిజయీభవ శౌర్యయుక్త
జయవిజయీభవ శాశ్వతకళ్యాణ
జయవిజయీభవ నయధురీణ

జయవిజయీభవ సర్వాంకపక్షజ్ఞ
జయవిజయీభవ సన్మనోజ్ఞ
జయవిజయీభవ సాధుజనాధార
జయవిజయీభవ భయవిదూర

గీ. యనుచు జయవాక్యముల జను లీవనుతిసేయఁ
జక్రహస్తుఁడవై రిపుక్షయ మొనర్చి
ధరణిఁ బాలింపు మాచంద్రతారకముగ
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. చాటకపోఁజుమీ! చాలఁబ్రోవకయున్న
నాఁటి ద్రౌపదిలో రోటిమాట
ప్రకటింతుజుమి! మమ్ము రక్షింపకుండినఁ
దగ గొల్లచెలుల వస్త్రములమాట
దాచనుజుమి! మమ్ము దరిజేర్పకుండినఁ
గొంకక మధురలోఁగుబ్జమాట
బైటఁబెట్టెదజుమీ! పాలింపకుండినఁ
గాలయవనునాఁటి కానిమాట

గీ. మర్మమెఱిఁగినవారితో మానువాదు
బైసి పోట్లాటకు మాపాలఁ గలిగి
సాధురక్షణ, దుష్టశిక్షణ మొనర్చు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. ఖలవధార్థమునందు నిలయ మొందితి వంటి
నలవెన్న దొంగిలి తనుట లేదు
లక్ష్మియా రుక్మిణీలలనఁ గూడితివంటి
వలరాధ మరిగితి వనుట లేదు
అవనిఁ బాలింపఁగా నవతరించితివంటిఁ
బశుపాలకుఁడవని పలుక లేదు
దుష్టులా రాజదైత్యుల హరించితివంటి
వల నరసారథి వనుట లేదు

గీ. యయ్య యెదురాడ నామాట లనకమున్నె
ఖలుల వధియించి నీసిగ్గు నిలుపుకొమ్మ
పరులు నవ్వఁగ నపకీర్తి పాలుగాక
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. గ్రామదాహకకర్మ గతిమానుపుమటన్న
వెస నదేమఱియుఁ గావించె దీవు
పథికుల దోపించు పనిమానుపు మటన్న
వెస నదేమఱియుఁ గావించె దీవు
చెరలు జూరలువట్ట సేగి మాన్పు మటన్న
వెస నదేమఱియుఁ గావించె దీవు
బహుసస్యనాశనార్భటి మానుపు మటన్న
వెస నదేమఱియుఁ గావించెదీవు

గీ. వేడుకొనుకొద్ది లావాయె వెఱ్ఱివాఁడ !
యోడముంచకు మనురీతి యొనరుమాకు
బుద్ధి దెచ్చుక యవనుల పొంక మణఁచు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. మామిడిచిగురు సొంపేమిలక్ష్యంబనఁ
గరచరణాంబుజకాంతి వెలుఁగఁ
గలకలనవ్వు చక్కని ముద్దు నెమ్మోము
పద్మసౌభాగ్యంబుఁ బరిహసింప
వెలిదమ్మిరేకుల వెలవెలబోఁజేయు
సోగకన్నుల జూపు చోద్యపఱుఁప
నిద్దంపు నునుఁజెక్కుటద్దంబులందును
మొలకనవ్వులతేట ముద్దుగులుక

గీ. నపుడు బుట్టిన పసిబిడ్డఁ డనఁగఁ బాల
కడలి మఱ్ఱాకుపైఁ బండిఁ కరుణ జగము
బ్రోతువఁట! మమ్ముఁ గావ విప్పు డడి యేమి?
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. పుడమిపై నడుగిడి నడువ నేరనివారిఁ
దీవ్రతపరువు లెత్తించినావు
పైమీఁది దుప్పటి బరువని వారిచే
మించైనమూట మోయించినావు

గడపదాటని కులకాంతామణులఁ బృథ్వి
నెల్లడఁ గలయఁ ద్రిప్పించినావు
షడ్రసోపేతాన్న సంభోక్తజన పరం
పరబలుసాకు పాల్పఱచినావు

గీ. భళిర! యఘటనఘటనాప్రభావ మెల్ల
దీనజనులందె చూపితి దెలిసివచ్చె
"నయ్య సామెల్ల నింట నే"యన్నమాట
వైరిహరరంహా! సింహాద్రి నారసింహ!

సీ. భవదీయముఖభవబ్రాహ్మణోత్తముల కా?
యవనులచేత నాయాసపడుట
భవదీయబాహు సంభవరాజవరుల కా?
మ్లేచ్ఛనాథుల గెల్వలేకయుంట
భవదూరుసంభవ బహువైశ్యకోటి కా?
తురకలచే నిట్లు దోపుబడుట
భవదీయపాదసంభవశూద్రజనుల కా?
విమతులౌ తురకల వెట్టిచేత

గీ. మాకుఁ జెప్పకు మెట్లైన మంచిదిగద!
లోకకర్తకు నపకీర్తి నీకువచ్చు
వలదు నాయన్న! యింకనైన ఖలుల నణఁచు
వైరిహరరంహా! సింహాద్రి నారసింహ!

సీ. రాఘవ! మముఁ బ్రోవ రావయ్య! ఖగయాన
రాకున్న మీ దశరథుని యాన
శీఘ్రంబు మమ్ము రక్షింపు శేషశయాన!
జాగుచేసినను కౌసల్య యాన!
మదిఁ గఠినతమాని మనుపుము మాయాన
మనుపకున్న వశిష్ఠమౌని యాన
పాలింపు మమ్ము నీపరమసత్కృప యాన
పాలింపకున్న శ్రీభామ యాన

గీ. యానబూన సమర్థుండ వఖిలజగము
నానఁదప్పక పోషింపు మాంచతార
తగవుదప్పి నటింపఁగా ధర్మమగునె?
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. అరులఁ గొట్టఁగ సింహగిరిగుహ డాఁగిన
నవని నిన్ బిఱికివాఁ డందురయ్య!
నీవు రక్షింపక నీలాద్రి కేగిన
నవని నిన్మొండివాఁ డందురయ్య!
పోషింపఁగాలేక శేషాద్రి కేగిన
నతిలోభి వనుచు నిన్నందురయ్య!
తగ నాదరింప కంతర్వేది కేగిన
నతిలోభి వనుచు నిన్నందురయ్య!

వరాహలక్ష్మీనరసింహశతకము.

గీ. నాథ ! యిటు లోకనటనం బొనర్చు నీకు
నహహా ! నిందలు వచ్చును నదియు విడచి
యొద్దుకొనంబోకు వెసఁ బ్రోవు ముద్విజనుల
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా !

సీ. అరిసైన్యధూళి సూర్యాక్రాంతమై మించె
నీకనేమి దయఁజూచెదవు మమ్ముఁ
బరభేరిభాంకృతు ల్పగిలించె దిశల నిం
కేమి నామొర విని యెదవు నీవు
ధరశత్రుహయఖుర దళితమయ్యె నిఁకేమి
వచ్చెదవయ్య ప్రోవంగ మమ్ము
వైరితేజశ్శిఖి జ్వలియించె నింకేమి
మొగమునఁ జూచెదు జగతిజనుల

గీ. నీపయికి వచ్చునప్పుడు నీవెఱుంగ
వేమి? మసలకు మింక దిక్కేది మాకు
జాగరూకుండవై రిపుక్షయ మొనర్ప
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా !

సీ. ప్రజలెల్ల బెసిఁగిరి పాశ్చాత్యరాట్చమూ
భీతులై మిమ్మును బిలిచి పిలిచి
జనులు వేసారిరి సమదతురుష్కుల
వెతలచే మిమ్మును వేఁడి వేఁడి

పరులెల్ల గ్రుక్కిరి నానాయవన హృత
రుక్కులై మిమ్మును గ్రొక్కి గ్రొక్కి
ప్రాణిసంతతి భంగపడియె ఖానులు సేయు
దరిలేని వెత మిమ్ముఁ దలఁచితలఁచి
గీ. యిందుఁ గలఁ డందు లేఁడని సందియంబు
జెందవలదన వేదవాగ్బృందమెల్ల
నెందు వెదకినఁ గానరావేమి యిపుడు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. బహుఫణాదీప్తుఁడౌ ఫణిరాజుపైఁ బండి
గాలివారకయుండఁ గాచె దీవు
వరగరుద్విస్ఫురద్గరుడుని పైఁ జెంది
చిరసుఖగతుల రక్షించెదీవు
వేత్రాధిగత జగద్వితతి నిష్వక్సేను
దరిఁ జేర్చి బలయుక్తి దనిపె దీవు
ఘనభుజాబలవంతు హనుమంతు నెదఁ జేర్చి
యెలమి బ్రహ్మానంద మిచ్చెదీవు
గీ. పొసఁగ నీరీతిఁ దలఁపోయఁ బొసఁగు చేతి
వానిపణ్యార మాయెఁగా దీనపాల!
పృథుబిరుదలీల! యేమూలఁ బెట్టినావు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. మాకు మొఖాసాకు గ్రామంబు నిమ్మనలేదు
కొంపలు గాల్పింపఁగూడ దంటి
కరిహయాదుల మేము కాక్షింపఁగా లేదు
గోవధ మాన్పించి ప్రోవుమంటి
మాకు మిమ్ములను సామ్రాజ్య మిమ్మనలేదు
జనులఁదోఁపింపఁగా జనదటంటి
స్వామి! మాకొలఁది కేమి కామింపఁగాలేదు
క్షితిలోనఁ బ్రజల రక్షింపుమంటిఁ

గీ. జెలఁగి నీపదసేవలు సేయు మాకు
వేరె కోరిక లేటికి వెన్నగలుగ
నహాహా! నేటికి నేతికి నంగలార్ప
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!

సీ. భక్తసంరక్షకకృపాపరజలజాక్ష
నరహరి గోవింద హరి ముకుంద
సంసారతారక సజ్జనాధారక
సత్యసంకల్ప శేషాహితల్ప
నీలాంబుదశ్యామ నిఖిలదైవలలామ
సర్వపాపవినాశ జగదధీశ!
శ్రీరమానాయక శ్రితఫలదాయక
శృంగారదరహాస చిద్విలాస

గీ. భవ దచలపాదగతులై రెరి యవను లయయొ!
అలుక మానక తరుము, వాండ్రడంద సిగయు
నందకుండినఁ గాల్పట్టుకొందు రయ్య!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. దశకంఠకంఠమర్దన దుర్దమాటోప
రామనామకమౌ ఫిరంగిదెబ్బ
తతమేఘనాదభేదక మోదలక్ష్మణ
ప్రకటనామకమౌ ఫిరంగిదెబ్బ
ఖర హిరణ్యాక్ష శిక్షకరూక్ష నిజనృహ
ర్యక్ష నామకమౌ ఫిరంగిదెబ్బ
కుంభినీభరణ విజృంభణ శ్రీకూర్మ
నామకమౌను ఫిరంగిదెబ్బ !

గీ. తగిలివచ్చియు చావక ధరణిఁ దిరిగె
యవనబలము సుదర్శనాహత మహోగ్ర
రాహువన నట్లుగాకుండ రహి జయింపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. గ్రామముల్ నిర్ధామధామము లాయెను
సస్యంబులెల్ల నాశనము జెందె
దొడ్లలో శాకముల్ దుంపశుద్ధిగఁ బోయె
దోచిరి సర్వంబు గోచిదక్క

చెట్లొక్కపిట్టయై చెదరిరి దిక్కులఁ
బలువెతఁ బడరానిపాట్లు పడిరి
యన్న మందరికిని నమృతోపమం బయ్యె
వరుసగా నటమీఁద వానలేదు

గీ. ప్రజల పస దీరె నిఁక మొద ల్పదిలమయ్యె
దఱిదఱికి వచ్చె నిదె మెంచు తురకదండు
చిత్తమునఁ జూచుకోవయ్య! శీఘ్రబుద్ధి
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. శ్రీదేవి మఱి తనుఁ జేర రాసీదని
భూదేవి వదలక బోదినె ననఁగ
మోక్షధనంబని మునులు మహాపేక్ష
చేతినిక్షేపంబు జేసి రనఁగ
భక్తాగ్రగణ్యుఁడై బలి పూజసేయఁగా
బలిసద్మముననుండి వెలసె ననఁగ
బ్రహ్మాదిహృదయసారసములతోడ దా
గుడుమూఁత లాడుచుండెను ననంగ

గీ. ధరణి గుప్తములైన పాదములతోడఁ
బారిపోలేవు యిఁక నేదిఁ బ్రతుకుత్రోవ
పౌరుషము చాలదు తురష్కబలముఁ ద్రుంప
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

గీ. సత్త్వజాసస్యసంరక్ష సలుప నిదియె
సమయ మోయయ్య! యిఁక మాను జాగుసేయ
నన్ను గన్నయ్య రక్షింపు నల్లనయ్య
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. నిడుదకడానిశా ల్నడుమున బిగియించి
తీరైన గండపెండేరమూని
రమణీయమణి శిరస్త్రాణ మాదలఁబూని
స్ఫుటవజ్రమయమైన జోడు దొడిగి
తూణంబు లిరువంకఁ దోరణంబుగఁగట్టి
విలసితశరమైన విల్లువట్టి
పరవైరిహరమైన తలవార్లు ధరియించి
దాపలఁ జికిలికటారి చెక్కి

గీ. రామవేషంబుతో సుమిత్రాసుతుండు
నీవు రణరంగముననిల్చి నిబిడశత్రు
జాలముల నేలపాల్సేయు లీలనెరపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. గాధేయయజ్ఞవిఘ్నకరాసురావళి
జక్కుజేసినయట్టి శౌర్యనిధివి
పరవీరభీకర పరశురాముని పరా
క్రమము బెండుగఁజేయు ఘనభుజుఁడవు

గీ. సత్ప్రజాసస్యసంరక్ష సలుప నిదియె
సమయ మోయయ్య! యింక మాను జాగుసేయు
నన్ను గన్నయ్య రక్షింపు నల్లనయ్య
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. నిడుదకడానిశా ల్నడుమున బిగియించి
తీరైన గండపెండేరమూని
రమణీయమణి శిరస్త్రాణ మౌదలఁబూని
స్ఫుటవజ్రమయమైన జోడు దొడిగి
తూణంబు లిరువంకఁ దోరణంబుగఁగట్టి
విలసితశరమైన విల్లువట్టి
పరవైరిహరమైన తలవార్లు ధరియించి
దాపలఁ జికిలికటారి చెక్కి

గీ. రామవేషంబుతో సుమిత్రాసుతుండు
నీవు రణరంగముననిల్చి నిబిడశత్రు
జాలముల నేలపాల్సేయు లీలనెరపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. గాధేయయజ్ఞవిఘ్నకరాసురావళి
జక్కజేసినయట్టి శౌర్యనిధివి
పరవీరభీకర పరశురాముని పరా
క్రమము బెండుగఁజేయు ఘనభుజుఁడవు

పదునాల్గువేల దుర్మదరాక్షసులతోడ
ఖరునిమర్దించిన వరబలుఁడవు
బంతులాడినరీతిఁ బంక్తికంఠుని తల
ల్ఖండించు చండప్రచండరుచివి

గీ. నీకు నొకదొడ్డకార్యంబె? నీచయవన
సేన నిర్జించుపని ప్రజల్సేసికొనిన
కర్మమున నీమచిత్తంబు కరఁగదాయె
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. కోటిసూర్యోజ్జ్వలత్కోటీరమణులతో
రమణీయమణి కుండలములతోడ
శంఖచక్రగదాసి శార్ఙ్గాయుధములతోఁ
బ్రస్తుతప్రభఁ గౌస్తుభంబుతోడ
వలిపె బంగరువల్వ వలెవాటు నీటుతోఁ
బొక్కిలి తామరపువ్వుతోడ
గంగను గన్న చక్కని పదాబ్జములతో
మిసిమి చామనచాయ మేనితోడఁ

గీ. బక్కిగుఱ్ఱంబు మీఁదను నెక్కి నాకు
బ్రొక్కఁగైకొని శౌర్యంబు పిక్కటిల్ల
నొక్కట యవనరాట్సేన చిక్కుసేయు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. దండంబునీకు నుద్దండ తేజశ్చండ !
జోహారు భక్తదుర్మోహనాశ
మ్రొక్కెదఁ గొను జలముక్కాయ రుక్కాంత
వందనంబిదె చిదానందకంద !
నుతిసేతు శతధృతిస్తుతియుతోన్నతచర్య !
ప్రణతిఁజేసెద మునిప్రణుతచరణ !
సాష్టాంగమిదె నీకు సాష్టాపదాంబర
కేలుమోడ్చెద జగత్కేళిలోల!

గీ. వలదు వలదు పరాకు భావమున నీకు
దీనజనములఁ గృపఁబ్రోవ దిక్కునీవ
దుష్టుల వధించి పోషింపు శిష్టజనుల
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా !

సీ. గరుడాచలంబుపైఁ గడకతో వసియించి
సత్యభామాతటిచ్ఛాయ నలరి
వరచాపకునియెడి హరిచాపమమరించి
వివిధభక్తుల కృపావృష్టిముంచి
అమరమయూరవారము మోదమందించి
దీనచాతకములఁ దృప్తినించి
క్షేత్రకన్యాకామ సస్యముల్పండించి
జగములు చల్లనై నెగడఁజేసి

గీ. నవఘనస్ఫూర్తిచే మురనరకధేను
ఖరదవానలమార్చిన కడక నిపుడు
రిపులశిక్షించి రక్షించు పృథ్విజనుల
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. నీపాదరజమున నిమిషంబులోపల
బాపురే సతియయ్యెఁ జాపరాయి
నీబాహుబలమున నిలవక పెళ్లిన
ముక్కంటి చాపంబు ముక్కలయ్యె.
నీయాజ్ఞచే గిరుల్ నీట దెప్పునఁ దేలెఁ
కడఁక సముద్రంబు గట్టువడియె
నీప్రతాపాగ్నిచే నిఖిలరాక్షసకోటి
మాడి దోమలపోల్కి మడసిపోయె

గీ. బాగులే! యిట్టినెరవైన ప్రాపుగల్గి
యల్పులకు లొంగి తిరుగలేమయ్య! మేము
కర్మమా! మాకుగజమెక్కి గంతదూర
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. మున్ను తాటకప్రాణము ల్గొన్న బాణంబు
మెఱసి సుబాహుదున్మినవిశిఖము
మించి విరాధు ఖండించిన ప్రదరంబు
ఖరదూషణాది సంహారశరము

మాయలమారీచు మదమణంచినతూపు
ఘోరకబంధుని గూల్చుచిలుకు
వాలి మహాశాలి గూలనేసిన కోల
జలధి నింకించిన సాయకంబు

గీ. రావణాదిమహాసురరాజి నణఁచు
చండకాండంబు లేమాయె చటులయవన
ఖండనముసేయ నయ్యంబకములఁ బఱపు
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా !

సీ. ఖలహిరణ్యాక్షముఖ్యుల నెల్ల ఖండించి
దేవతాతతిఁబ్రోచు దివ్యమహిమ
రావణకుంభకర్ణ ప్రముఖుల నెల్ల
గొట్టి మానులఁబ్రోచు దిట్టతనము
శిశుపాలకాది దుశ్శీలురఁ బరిమార్చి
క్షితి దీనజనుల రక్షించుకడక
కంసాది దుష్టవిధ్వంసనం బొనరించి
ధరణిఁ బాలించు నుదారకరుణ

గీ. వినుటయేకాని కన్నులఁ గనుటలేదు
కంటి మిప్పుడు యవనుల గర్వమణఁచి
ప్రజలరక్షించు నీదు ప్రభావమెల్ల
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా !

సీ. జయమూఁడె యవనరాట్సంతమసము బాసె
భవదీయభాస్వత్ప్రభాబలమున
భువనజాతంబులు పొలుపుచేఁ జెన్నొందె
దిక్చక్రములుచాలఁ దెలివినొందెఁ
గమలజాదుల నతుల్గణనసేయని నీవు
లీల వామనవి చెల్లించినావు
బ్రహ్మాండభాండ సంభరణలీలాఘను
నిల నిన్ను మెచ్చి యే మియ్యఁగలను ?

గీ. తోఁచ దిఁక నెట్టు లిదెనాకు దోఁచినట్టు
తులసిదళ మొక్కటిత్తు సంతోషమొందు
మదియె యగణితపూజగా నవధరింపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. అపరాధినపరాధి నార్తరక్షణదక్ష !
యపరాధినపరాధి నంబుజాక్ష!
యపరాధి నపరాధి నద్భుతగుణధుర్య !
యపరాధి నపరాధి నధికశౌర్య !
యపరాధి నపరాధి నంభోధిగంభీర!
యపరాధి నపరాధి నత్యుదార!
యపరాధి నపరాధి నానందపరిపూర్ణ !
యపరాధి నపరాధి నభ్రవర్ణ !

గీ. నేర్చియైనను మిక్కిలి నేరకైన
నిష్ఠురోక్తులఁ బల్కితి నిన్ను నాకు
తప్పు సైరించి దాసుని దయదలంపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. వీరాధివీరుండవై రాజిలెడు నిన్ను
బిఱికివాఁ డంటిని భీతిలేక
జగదేకవితరణాశ్రయమూర్తి వగు నిన్ను
బహులోభివనుచును బలికినాఁడఁ
బరిపూర్ణకరుణాస్వభావుండవగు నిన్ను
నిర్దయుండంచు నిందించినాఁడ
నద్భుతానంద కళ్యాణగుణుండవౌ
నినుఁగూర్చి పలికితి నిర్గుణుఁడని

గీ. యలుకజనియించి దుష్టుల నణఁచుకొఱకు
పడుచుఁదనమున నిటులంటి భక్తవరద!
మదపరాధసహస్రముల్ మది క్షమింపు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. పరమమోహాంధుండ పాపస్వభావుండ
దుశ్శీలపరుఁడను దుర్మనుండ
దుష్కామయుక్తుండ దుర్మార్గసక్తుండఁ
గ్రోధాంతరంగుఁడఁ గుటిలమతిని

లోభిని నింద్రియలోలుండఁ జపలుఁడ
దంభవృత్తుండ మాత్సర్యయుతుఁడ
దుష్టుండ దుస్సంగదూష్యుండ శమదమ
హీనుఁడ శౌర్యవిధానపరుఁడ

గీ. నైన శరణొందితిని నన్ను నాదరింపు
సజ్జనులకైన మిగుల దుర్జనులకైన
సౌఖ్యమొసఁగదె కల్పవృక్షంబునీడ
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. తే నమో రక్షిత దేవరాయ సురేంద్ర
సేవితాయ మునీంద్రభావితాయ
తే నమో నిత్యసుధీరతాయ సుమేరు
ధీరతాయ యశుభవారణాయ
తే నమో నిర్జితదీనతాయ భృతాప్త
మానవాయ దళితదానవాయ
తే నమో జ్ఞానసుధీహితాయ చిరాయు
తాకృతాయ బుధోరరీకృతాయ

గీ. "పాహిమాం పాహి మా మన్యథా హి నాస్తి
శరణమరుణాబ్జదృక్కోణ కరుణ" యనుచు
వందనము చేసి కొల్తు భావమున నిన్ను
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. స్నానసంధ్యాద్యనుష్ఠానశక్తుఁడఁ గాను
పరమ యోగాభ్యాసపరుఁడఁ గాను
విమలదివ్యక్షేత్ర గమనదక్షుఁడఁ గాను
ఘనవరదాన సంగతుఁడఁ గాను
భవదీయపదపద్మ భక్తియుక్తుఁడఁ గాను
నిరుపమాజ్ఞానమానితుఁడఁ గాను
పరమోపకార సంభరితచిత్తుఁడఁ గాను
శమదమసత్యనిశ్చలుఁడఁ గాను

గీ. వినుము దీనావన! యనాథజనుఁడనయ్య!
నేను మిక్కిలి తెలియఁగా నేరనయ్య!
దేవ నిర్హేతుకృప నన్నుఁ బ్రోవవయ్య!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. ధరణిగుప్తంబైన చరణయుగ్మముతోడ
నలరారు ప్రక్కగాయంబుతోడ
రమణీయమైన వరాహాననముతోడ
ఘనతర ఫాలలోచనముతోడ
నిగనిగలాడు బల్నిడుదకీల్జడతోడ
నవ్యగోక్షీరవర్ణంబుతోడ
మైనిండ నలఁదిన మంచిగంధముతోడ
నిమిత భక్తానుగ్రహంబుతోడ

గీ. నఖిలలోకావనము సేయ నవతరించి
యున్న మిమ్ముల వినుతింప నోపలేరు
హిమకరకిరీటముఖులు నే నెంతవాఁడ
వైరిహారరంహా! సింహాద్రి నారసింహా !

సీ. సోమకాభిఖ్య రక్షోనేత, ధృతిచేత
నామ్నాయజాతము లపహరించి
మధ్యేనదీనాథమగ్నుఁడై డాఁగినఁ
ధర్తలు దునిబు వేదములు మరల
ధాత కొసంగఁగా దలఁచి నీ వల మత్స్య
మూర్తివౌటను తపస్స్ఫూర్తివేళఁ
దొడరి ధీవరులు సద్గుణజాలముల నుంచి
నిలుపు దురాత్మ మందిరములందుఁ

గీ. కాన నిను భక్తిరసపూరకలిత లలిత
మామకీనమనస్సరోమహితుఁ జేతు
శీఘ్ర మిష్టమొసంగ వేంచేయవయ్య
వైరిహారరంహా! సింహాద్రి నారసింహా !

సీ. చలవగాఁ బన్నీట జలకంబు లొనరించి
విలువలేని కడాని వలువగట్టి
కలికి మానికముల గులుకు గద్దియ నిల్పి
తిలకంబు నొసల జెన్నలర దిద్ది

కలపంబు మైనిండ నలఁది బల్మొగరాల
తళతళలాడు సొమ్ములు ధరించి
యలరు నెత్తావిదండలు వీలుగా వేసి
కలితరసాన్న మింపొలయఁ బెట్టి

గీ. విడె మొసఁగి పద మొత్తెద వేడ్కతోడఁ
బవ్వళింపుము మన్మనః పద్మశయ్య
నలరిపుల నెల్ల మర్దించి యలసినావు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. భువనము లుక్కుకుక్షిలోఁ బూని రక్షించి తా
భువనంబులో నిక్కముగఁ జరింతు
పరమాణురూప విభ్రాజమానుఁడ వయ్యుఁ
దామేటిరూపంబు దాల్పనేర్తు
నసమవైరాగ్యమానసుఁడ వయ్యు వినోద
గతితోన మందరాగము ధరింతు
నతనిర్భరాత్ముఁడవై వెలింగియుఁ తా న
నంతరూపంబు ధరింతు నెప్డు

గీ. డనుచు లోకోపకారార్థ మవతరించి
మించి తా క్రియ లొనరించి మిగులఁ జెలఁగు
కూర్మనాయక నన్నేలుకొనఁగదయ్య!
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. అతితిగ్మరుచి మండలాక్షి యుగ్మచ్ఛాయ
వలయాద్రిదావాగ్నివలె వెలుంగ
రిక్కించ తనురుహశ్రేణి గాడిన యఖం
డాళి సూచ్యగ్రిముక్తాంచితముగ
గురుదివాభేదకఘుర్ఘురధ్వని క్షయ
స్తనయిత్ను గర్జకుం జనువు సెప్ప
పదఘట్టనలఁ జిమ్ము ప్రళయోదకము నభ
స్థలము నామ్రేడితార్ణముగఁ జేయఁ

గీ. గిటితనువుతో హిరణ్యాక్షు గీటడంచి
క్షమ ధరించితి చర్వణసమయలగ్న
మేఘశకలంబుగతి దంష్ట్రిమీఁద నడర
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. నతిఁ జేతు నిదె నీకు నాసికానిస్సృత
ఝంఝానిలోద్ధూత శైలజాత
వందనం బిదె నీకు ప్రహ్లాదశుకపరా
శరధీరహృదయ గహ్వరవిహార
సాష్టాంగ మిదె నీకు స్వర్భాను హిమధామ
జేతృప్రతాప నృసింహరూప
ప్రమొక్కిద నిదె నీకు క్రూరసంహారక
సాగరపూరకోదారకరుణ

గీ. పాలనమొనర్ప నఖరకుద్దాలదళిత
కనకకశిపు దానవ ఘనతను విదళన
జాతకీలాలపరితృప్త భూతనివహ
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. దేవతాతతికోర్కె దీర్పగా నమకట్టి
జనకతార్థికిఁ గశ్యపునకుఁ బుట్టి
యుదుఁ ట మృదూర్ధ్వపుండ్రము బెట్టి
డంబు కేలఁబట్టి
పసపుని పచ్చగోచియుఁగట్టి
మధ్యస్థలంబున మౌంజిఁజుట్టి
వర్ణనీయద్విజవర్ణివై పొడకట్టి
బాలార్కశతశతాభ గను పట్టి

గీ. ధరణి గగనము రెండుపాదముల మట్టి
మరితృతీయాంఘ్రి నబ్బలి మట్టిపెట్టి
వామనా! ప్రేమ నామనస్సీమ నుండు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. కార్తవీర్యార్జున కరచయారణ్యంబు
దారుణాగ్రకుఠారధార దునిమి
చిరతరక్షత్రియక్షేత్రముల్ సొంపుగా
భీమేశుహాలముల దెగడదున్ని

తన్నృపమ స్తకతతులు గుట్టలుగ బైచి
మిగులఁ జిత్రంబుగా మెట్లుగట్టి
తత్తనుకీలాల ధారాసరిత్తుల
నవనవంబులుగఁ గాలువలుదిద్ది

గీ. ఘనయశస్సస్య మవని నాకసమునిండఁ
బ్రబలజేసితివౌ భళీ ! పాదుకొనియె
భావిహాలమూర్తి పరశురామావతార
వైరిహారరంహ! సింహాద్రి నారసింహ !

సీ. మనువంశభూషణ మహిమచేఁజెన్నొంది
ఘనకళాసాంగత్య కలనఁజెంది
సకలనాయకవర్ణ సంగతి నింపొంది
సద్గుణరీతిఁ బ్రశస్తినొంది
యత్రానపటలలీలాత్మతఁ జెలువొంది
నిర్దోషగతులచే నెరపుసెంది
సకలజగన్నుత సంపద జెన్నొంది
సుకుమారరత్న సంశుద్ధినొంది

గీ. సరసదశరథపత్ని కౌశల్యగర్భ
మనెడు గనియందు హరినీలమన జనించి
రామసంజ్ఞ మెలంగు నిర్నిబస్తుతింతు
వైరిహారరంహ! సింహాద్రి నారసింహ !

సీ. ఫణిరాజశయ్యపై బవ్వళించెడి నీవు
పండితి కౌసల్య ప్రక్కలోన
బ్రహ్మాండగోళము ల్ప్రాకియాడెడు నీవు
రహిఁ బ్రాకితి దశరథునియింట
బహువేదశాస్త్ర ప్రభావుండవౌ నీవు
నవ్యక్త వాక్యములాడినావు
సకలచరాచర సంచారివగు నీవు
మహిఁ దప్పటడుగుల మసలినావు

గీ. తల్లిభాగ్యముననొ ? తండ్రితపముగతినొ ?
పురజనంబుల తొల్లిటి పుణ్యముననొ ?
భూవ్రతంబుననో? యిట్లు పుట్టి తీవు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. చిరుతకూకటిఘటించిన రావిరేకము
త్యములు నెన్నొసటిపై దుముకుచుండ
నిద్దంపుఁజెవుల చెందిన పెద్దమగరాల
మద్దికాయలజత ముద్దుగులుక
పులిగోరునాటిన బలుపద్మరాగంబు హార
మక్కునఁ దళుక్కనుచు మెఱయఁ
గంకణధ్వనిమొలగంటల రొదయు కిం
కిణిరావములను నేకీభవింప

గీ. భరతలక్ష్మణశత్రుఘ్న బాలకేళి
దనరు నినుఁగన్నతలిదండ్రు లనఘు లెన్న
జిన్నిరామన్న ! నన్నురక్షింపుమన్న
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. రత్నకీలితతనుత్రాణంబు ధరియించి
కస్తూరికా తిలకంబుదిద్ది
బాణాసనసబాణ తూణీరములదాల్చి
యందంపుజాభరా గంధములఁది
మొసలివా నెరబాకు మొలఁజక్కఁగాఁ జెక్కి
కలికి బంగరురంగుకాసె గట్టి
భీకరంబుగ గండపెండేరములుపూని
నవరత్నమయ భూషణములుదాల్చి

గీ. వీరశృంగారరసములు వెలయ నీవు
కౌశికునితోఁ జనుట తాటకావధంబు
సలుప జానకి బెండ్లాడఁ దలఁచియొకద
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ

సీ. శిల డాసినప్పుడె చికురభావముఁ దోఁచెఁ
బదపద్మకలిత షట్పదములనఁగ
నడుగిడినప్పుడె యాననంబేర్పడె
నఖతారగతి నిశానాథుఁడనఁగ

నంజవేయఁ గుచద్వయము గనుపట్టెను
రతియుక్త కోకదంపతు లనఁదగి
కలయఁ గ్రుమ్మరు వేళఁ గాంతయయ్యె దనూజ
నొసఁగ నల్లునిఁజూచు నుర్వియనఁగ

గీ. నంత గౌతమునతివ యహల్యయగుచు
నతిథిసత్కారములు సల్పెనఁట త్వదంఘ్రి
రజము నుతిసేయఁ దరమె శ్రీరామచంద్ర
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. జనకరాజన్య సంసన్మధ్యమున నుండి
గొబ్బున లేచి వేనిబ్బరముగ
మణిలసత్కంకణ మంజుధ్వనుల చేత
రాజన్యమనములు రగులఁజేసి
సామిలంబుగఁ గంఠసరములు దాలిచి
యీశ్వరచాపంబు నెత్తి హస్తి
హస్తాగ్రహమున బిస మవలీలఁ గొనులీలఁ
గొనినారి దివియ ఫెల్లునను విరిగె

గీ. విరిగె రాఘవ! తద్ధ్వనిఁ దరులు గిరులు
విరిగె నృపులమనస్సులు, విరిగె నృపుల
నడుము, ఫెల్లునసీభుజౌన్నత్యగరిమ
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. కనకశలాకశృంగారతరంగంబు
రాజమరాళసామ్రాజ్యలక్ష్మి
మదనబాణము నవమాలిక మాణిక్య
వల్లరి చంచలావల్లి చంద్ర
కళ ధగద్ధగిత నక్షత్రంబు నవరత్న
మంజరి కందర్ప మదగజంబు
లావణ్యసరసి విలాసపేటిక మనో
జవనవాటిక ఘనసారఘుటిక

గీ. జాతరూపసమేత భూజాత జనక
జాత దృగ్జిత నవవనజాత సీతఁ
బరిణయంబగు నీమూర్తిఁ బ్రస్తుతింతు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. కల్యాణవేదికఁ గౌతుకంబులు దాల్చి
యందంపు మైగంద మలఁది ప్రేమఁ
దెర వైచి బాసవాసైరవలు దీవింప
లోలోనఁ జూచు మేల్చూపుసొగసు
తోరంపుముత్యాలు దోసిళ్ళఁ గీలించి
తలఁబ్రాలు వోయు బిత్తరపుఁగోపు
మంగళసూత్రసంబంధ వేళానోన్యన్య
పులకితస్విన్నాంగముల మెఱుంగు

గీ. చెట్టపట్టులతో నలసీత నీవు
గురువులకు వందనము సేయు కూర్మిభక్తి
రంగుమీరంగ మిథిలాపురంబునందుఁ
జూచు పుణ్యాత్ము లేనోము నోచినారొ
భద్రియుతకీర్తి శ్రీరామభద్రమూర్తి.
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. తమ్ములు నీవు నందమ్ముగాఁ బెండిలి
కొడుకులై సతులతోఁగూడి చనుచు
పరశురాముని భంగపఱచి యయోధ్యాపు
రంపు వైభవము మీరంగఁజేరి
కోరిక ల్మీరఁగాఁ గొన్నాళ్లు వసియింప
దశరథేశుఁడు మీకు ధర్మనియతి
యువరాజ్యపట్టణోద్యోగంబుఁ గావింపఁ
గడుఁ జూడఁజాలక కైక మిమ్ము
గీ. సకలలోకైకనిందకు జడియ కకట!
యడవులకు నేగుమనఁగ నోరాడె నెట్లు
కైక నననేల? నీదు సంకల్పమట్లు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

సీ. అంటినఁ గందెడు నడుగుదమ్ములతోడ
నడవికి జానకి యెట్లు నడచెనయ్య!
పుడమి నేలుట మాని జడదారులగు మిమ్ముఁ
దల్లిఁ గన్గొని యెట్లు తాళెనయ్య!

యనుఁగుఁ దమ్ముఁడు సుమిత్రాత్మజుఁ డొక్కఁడె
మిముఁ గొల్చి వెతమాని మెలఁగెనయ్య !
నీదుపావలు రాజ్యనేతలుగాఁ గొల్చి
భరతుఁ డక్కట ! యెంత భక్తుఁడయ్య !

గీ. చిత్రకూటాద్రిఁ గడుఁ దప్పు జేసినట్టి
చెడుగుకాకము మరల రక్షించినావు
రామ ! నీవెంత కరుణాంబురాశివయ్య !
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. దండకారణ్యదైత్యావళిఁ బరిమార్చి
సాపరాధు విరాధు రూపుమాపి
మునుహేతి జుప్పనాతిని విరూపినిఁ జేసి
ఖరకృత్యు ఖరదైత్యు ఖండణంచి
మాయాతినీచుని మారీచుఁ బరిమార్చి
దుర్మదాంధునిఁ గబంధుని వధించి
తతవక్రశీలముల్సాళముల్ ఖండించి
వాలి దోర్బలశాలిఁ గూలనేసి

గీ. తోడరి సుగ్రీవ హనుమదాదులను గూడి
వనధి గర్వ మడంచి రావణునిఁ ద్రుంచి
ఘనవిజయ మొందు వీరరాఘవుఁడ వీవు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

## వరాహలక్ష్మీ నరసింహాశతకము.

సీ. శాశ్వతంబుగ విభీషణునికి లంక ని
శ్చలకృప నొసఁగుట దలఁచుకొన్నఁ
జెరబడ్డ సురసిద్ధగరుడగంధర్వకాం
తల విడిపించుట దలఁచుకొన్న
నిఖిలలోకంబులు నిష్కళంకములుగా
నలరఁ బ్రోచినవింత దలఁచుకొన్న
కొలచినవారికిఁ గొంగుబంగారమై
తగుకోర్కె లిచ్చుట దలఁచుకొన్న

గీ. ముదముగాను ధరాసుత ముద్దరాలిఁ
బరమపావని వినరాని పలుకు లాడి
యగ్నిఁ జొరఁజేయుటకె మాకు నలుకపుట్టె
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా !

సీ. అభినవాయోధ్యాపురాంతఃపురమునందు
మిసిమిబంగరురంగుమేడలోన
జిలుగు మేల్ రతనాలసింహాసనముమీఁద
వామాంకమున సీత ప్రేమ గులుక
హనుమంతుఁ డగ్రంబునందు భక్తిఁ జెలంగ
ఛత్రంబు వెనుక లక్ష్మణుఁడు పట్ట
భరతశత్రుఘ్నులు పార్శ్వస్థులై వీవ
వాయువ్యతటి జాంబవద్విభీష

గీ. సేనజాంగదముఖులు పెంపెసఁగ మధ్య
నీల జలరుహరుచిమీరు నిన్ను రాము
రమ్యగుణధాము పట్టాభిరాముఁ గొల్తు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. మానితమూర్తియై మహిమచేఁ జెన్నొంది
కామపాలాభిఖ్యగరిమఁ జెంది
పంకజాతంబులఁ బరిమార్చుకళ మించి
యరిభయంకరగతి నధిగమించి
శుభకరధవళాంగశోభచేఁ దనరారి
రేవతీరమణాంక రీతిమీరి
సద్బలభద్రప్రశస్తిచేఁ జెన్నొంది
ఘనతరరామాకృతిని జెలంగి

---

గీ. చంద్రుఁడన భూజనాహ్లాదసరణి మీఱు
నిన్నుఁ గొనియాడఁదరమె ? వాక్పతికైన
నతుల సంకర్షణ స్వరూపాభిరామ
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. నీ మహామహిమ వర్ణింపఁగాఁ దరమౌనె ?
ఫణిపతి కైన వాక్పతికినైన
సకలలోకంబులు జననంబునొందింప
రక్షింప శిక్షింప రాజ వీవ

యఖిలజగత్కంటకాకృతి నుగ్రులౌ
త్రిపురరాక్షసుల మర్దించుకొఱకుఁ
తద్వధూనికరవ్రతంబులు భంజించి
దుష్టసంశిక్షయు శిష్టరక్షఁ

గీ. జేయఁగా బుద్ధమూర్తి ప్రసిద్ధిఁగన్న
యతుల కారుణ్యమూర్తి నిన్నభినుతింతు
నీ పదంబులపై భక్తినిలుపఁజేయు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. అయ్యారె! నెమ్మోము నొయ్యారమాభళీ !
నిక్కువీనులు ముక్కు చక్కఁదనము
ఔర కైజామోర ! యల్లార్చునద్ధతి
సేబాసు రొమ్ములో జిగిబెడంగు
అన్నన్న ! చిత్రతరాంఘ్రిధారాగతి
వాహువా ! సుందరబాహులీల
ఆహా ! సమస్తశుభావర్త విస్ఫూర్తి
బాపురే ! విపులమౌపీపు ! కోపు

గీ. అనుచు సకలజనుల్ చోద్యమంది పొగడ
ఘనతరాశ్వంబుపై నెక్కి కలికిమూర్తి
వగుచుఁ బాశ్చాత్యవరులను నణచెదీవు
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ !

సీ. దేవకీసతి వసుదేవనందనుఁడవై
నందయశోద లానంద మొంద
సమదాత్మపూతనా శకటతృణావర్త
ధేనుక ముష్టికాదికులఁ ద్రుంచి
గొల్లచేడెల వల్వ లుల్లంబులు హరించి
మామ కంసుని ద్రుంచి మధుర నలరి
రుక్మిణి ముఖ్యసరోజేక్షణలఁ గూడి
ద్వారక వసియుంచి ధర్మసరణిఁ
గీ. పాండవులఁ బ్రోచి కౌరవబలము నడఁచి
భక్తరక్షణ శిక్షచేఁ బ్రబలినట్టి
కృష్ణ! గోవింద! మాధవ! కేశవ! హరి
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా !

సీ. మాణిక్యపీఠికామధ్యపద్మస్థితు
రవికోటితేజోవిరాజమానుఁ
గందర్పశతకోటి సుందరాకారుని
శంఖచక్రగదాసిశార్ఙ్గధరుని
శ్రీభూమి యువతి సంశోభిపార్శ్వద్వయు
నంచిత పుండరీకాయతాక్షు
శ్రీవత్సకౌస్తుభ శ్రీహారయుతవక్షుఁ
గటిల సన్మణికాంచి కనకచేలు

గీ. మకుటకుండల కేయూర మహిత కంక
ణాంగుళీయక ముఖ్యభూషాంగు ఁడవని
లయు నారాయణస్వామి నిన్నుఁ గొల్తు
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!

సీ. తిరుమల పెద్దింటిధీరసంపత్కుమా
రార్యసద్వేంకటాచార్యశిష్య
సురుచిరాపస్తంబ సూత్ర మౌద్గల్యస
గోత్రు గోగులపాటి కులజగౌర
మాంబికాశ్రిత బుచ్చనామాత్య వరపుత్రుఁ
గూర్మదాసాఖ్యు నన్ గూర్మి నీదు
చరణదాస్య మొసంగి సంతరించితి భళీ!
మే రచించినయట్టి యీ శతకము

గీ. వినిరఁ జదివిన వ్రాసిన వివిధజనుల
కాయురారోగ్య మైశ్వర్య మతి శుభంబుఁ
గరుణ దయచేసి పాలింపు కమలనాభ!
వైరి హరరంహా! సింహాద్రి నారసింహా॥

వరాహలక్ష్మీ నరసింహశతకము
సంపూర్ణము.



# ఆంధ్రవిజ్ఞానసమితి,

## విజయనగరము.

**అధ్యక్షులు, కోశాధిపతులు:**

రావుసాహేబు వేపకొమ్మ జి. సుబ్బయ్యపంతులుగారు,
బి ఇ. యం. ఐ. ఇ.,
చీఫ్ ఇంజనీయరు శ్రీ విజయనగరం ఎస్టేటు,

**ఉపాధ్యక్షులు:**

అడిదము రామారావు పంతులుగారు,
రిటైర్డు సీనియరు తెలుగు పండిట్, శ్రీ మహారాజావారి కాలేజి.

**కార్యదర్శి:**

గంటి సూర్యనారాయణశాస్త్రిగారు,

**కృత్య సమాలోచన సమితి:**

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ,
తాతా సుబ్బారాయశాస్త్రిగారు,

శ్రీమాన్ పరవస్తు రామానుజస్వామిగారు, యం. ఏ.,
ప్రిన్సిపాల్ శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల.

శ్రీమాన్ టి. నరసింహాచార్యులుగారు, ఎం. ఏ. యల్. టి.,
లెక్చరర్ భాషాశాఖ శ్రీ మహారాజావారి కాలేజి.

డాక్టరు, బుర్రా శేషగిరిరావు పంతులుగారు,
యం. ఏ, పి హెచ్. డి.,

ఆకుండి వేంకటశాస్త్రిగారు,
పండితులు, శ్రీ మహారాజావారి సంస్కృతకళాశాల,
ఆంధ్రయూనివర్సిటి సెనెటు, ఎకమిడిక్కౌన్సిలు, బోర్డాఫ్ స్టడీసు సభ్యులు.

# సమితి యుద్దేశములు

ఆంధ్రవాఙ్మయ ప్రపంచమున నింతవఱకెన్నియో యుద్గ్రంథములు వెలువడియున్నవి, వెలువడుచున్నవి. అవి యన్నియు ఆంధ్రవిజ్ఞానాభివృద్ధికి సహకారములగుచున్నను, ఆంధ్రవిజ్ఞానస్రవంతిని ఆంధ్రావనిలో సర్వతోముఖముగ ప్రవహింపజేయఁదలంచి, మే మీ "ఆంధ్రవిజ్ఞానసమితి"ని నెలకొల్పినారము.

ఇందు ప్రాచీనాధునిక సారస్వత, చారిత్రిక, నైతికాది సంబంధ బంధురములగు హృద్య గద్య పద్యగ్రంథములు, సంవత్సరమునకు నాలుగింటికి తక్కువగాకుండఁగ బ్రచురించ నిశ్చయించితిమి.

శాస్త్ర సంబంధములగు ప్రాచీనగ్రంథములను, రసభరితములగు ప్రాచీన ప్రబంధ రాజములను, అధునాతన కవిపుంగవులు, విద్వాంసులు, కళాభిజ్ఞులు మున్నగువారిచే రచియింపఁబడిన ప్రకృతోపయోగములైన గ్రంథరాజములను మాసమితికి పంపిన, వాటిని సవిమర్శముగ పరిశీలించి, ముద్రణార్హములగునేని వాటిని ముద్రించుటకు ప్రయత్నించెదము. ఇంతియెగాక, ముద్రితగ్రంథములవలన లభించినలాభములో కొంతపాలు తద్గ్రంథాధికారికి కోరినచో లభించగలదు.

సమితి యాదాయమంతయు, గ్రంథప్రచురణకు, గ్రంథకర్తలకు, ప్రాచీన గ్రంథసంపాదనకు వినియోగింపఁబడగలదు, గాన ఆంధ్ర భాషాభిమానులు, ఆంధ్ర భాషోద్ధారకులు, ఆంధ్ర విజ్ఞాన సంవర్ధకులగు ఆంధ్రమహాశయులు మాయీ సమితిలో పోషకులుగను, చందాదారులుగను, జేరి, మా యుద్యమమునకు చేయూత నొసంగి, మాకుతోడ్పడి భాషాభివృద్ధిని చేయుదురుగాక యని యాశించుచున్నారము.

---

## నిబంధనలు.

పోషకులు:— సంవత్సరమునకు 10- రూపాయిలు తక్కువగాకుండ నిచ్చువారు యీ సమితికి పోషకులుగ పరిగణింబడుదురు. సమితినుండి వెలువడిన గ్రంథములన్నియు వినామూల్యముగ పొందగలరు.

చందాదారులు:— సంవత్సరమునకు 4- రూపాయీలు ముందుగా నిచ్చువారు చందాదారులుగ నుండగలరు. సమితివారే తపాలాఖర్చులను భరించి గ్రంథముల నందింపజేయుదురు.

చందా నిచ్చువారు తప్పక రశీదును పొందవలెను. చందాసొమ్ము అధ్యక్షునిపేరిట పంపవలెను. గ్రంథములు వి. పి గా పంపబడవు.

చందాదారులుగా జేరని యితరులకు తపాలాఖర్చులుగాక గ్రంథము 1 రూపాయికి లభించగలదు.

---

# విక్రమసంవత్సరగ్రంథములు.

1. రాధామాధవసంవాదము:— వెలిదిండ్ల వెంకటపతిమహాకవి ఇందురాధామాధవుల సరససంభాషణములు ఇంపు సొంపుగా వర్ణింపఁబడియున్నవి. వెల రు ౧—౦—౦.

2. విస్మృతకళింగాంధ్రకవులు:— శ్రీ అడిదము రామారావు పంతులుగారు ఇంతవఱకు కవులచరిత్రకెక్కని: కళింగదేశమునగల ప్రసిద్ధులగు 15 గురు కవులజీవితచరిత్రాదులు వివరింపఁబడియున్నవి. రు ౧—౦—౦.

3. వాల్మీకిచరిత్రము:— రఘునాథభూపాలప్రణీతము, ఇందు ఆదికవియగు వాల్మీకిమహామునిచరిత్రము చక్కఁగా చెప్పఁబడినది.

రు ౧—౦—౦.

4. ధర్మజ్ఞచరిత్రము:- { శ్రీవేపకొమ్మ గురు వెంకటసుబ్బయ్యపంతులు శ్రీమతి ఆదిలక్ష్మమ్మగార్లచే సంకలితము.
గృహస్థాశ్రమములో నుండి, దేవతోపాసన సత్ప్రవర్తనమూలమున మోక్షమునుసాధించు మార్గమును దెల్పుపుణ్యగ్రంథము. రు ౧—౦—౦.

5 రుక్మవతీపరిణయము:— రేకపల్లి సోమనాథకవి (అడిదము సూరకవికి సమకాలీనుడును, ప్రతిస్పర్ధియు నైనవాడు)

ఇందు రుక్మవతికల్యాణమహోత్సవము వర్ణితము. చక్కని ప్రౌఢప్రబంధము రు ౧—౦—౦.

---

# వృషసంవత్సర గ్రంథములు.

6 మృత్యుంజయవిలాసము:—(యక్షగానము) ఇందు గౌరీకల్యాణము మనోహరముగ వర్ణితము (గోగులపాటి కూర్మనాథకవి కృతులు—ప్రథమభాగము) రు ౧—౦—౦,

7 లక్ష్మీనారాయణసంవాదము, సుందరీమణిశతకము. సింహాద్రినారసింహశతకము:— (కూర్మనాథ కవికృతుల ద్వితీయ భాగము) రు ౧—౦—౦.

8 ద్వైతాద్వైతదర్శనములు:—(విద్యారణ్యకృతమునకు ఆంధ్రీకరణము) శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ సుబ్బారాయశాస్త్రిల వారిచే నాంధ్రీకృతము. రు ౧—౦—౦.

9. బాలగోపాలవిలాసము (నీలాపరిణయము) ఒడ్డియకవి విరచితము రసవత్తరమగు ప్రాచీనప్రబంధము. రు ౧—౦—౦.

10. తత్త్వసంగ్రహరామాయణము:— (బాలకాండము—ప్రథమభాగము) బ్రహ్మానందభారతీస్వాములవారి సంస్కృతగ్రంథమునకు ఆకుండి వెంకటకవిఆంధ్రీకరణము. రు ౧—౦—౦.

11. తత్త్వసంగ్రహరామాయణము:—(బాలకాండము—ద్వితీయభాగము) రు ౧—౦—౦